PRSVMO2A186

సాహిత్య

# ప్రస్థానం

నవంబర్ 2017

సంపుటి : 16 సంచిక : 11

## తెలుగు భాషా వికాసం

తెలుగు రాష్ట్రాల్లో తెలుగులో చదువుకోవడమే దుస్సాధ్యంగా మారిన వేళ మరోసారి మాతృభాషా నినాదం ముందుకురావడం సంతోషకరమైన పరిణామం. తెలుగు అంతరించిపోతుందని గగ్గోలు పెడుతున్నారని కొందరు ఎగతాళి చేస్తుంటారు. ఇన్ని కోట్లమంది మాట్లాడే భాష మాయమై పోతుందని ఎవరూ అనుకోవడం లేదు. ఏదో సెంటిమెంటు కోసం గగ్గోలు పెట్టడం లేదు. కాని ప్రపంచీకరణ పదఘట్టనల్లో ఆ సంకేతాలున్నాయి. మాతృభాషలో చదువుకోవడం శాస్త్రీయమనీ, సులభమనీ చరిత్ర వైజ్ఞానిక పరిశోధనలు నిరూపిస్తున్నాయి. అందులోనూ అత్యధిక ప్రజానీకం వెనుకబాటులో అజ్ఞానంలో మునిగివున్న ఈ విశాల దేశంలో వారి వారికి తెలిసిన భాషల్లో చదువుకుంటే నాలుగు అక్షరముక్కలు వస్తాయనే ఆశ దీనికి కారణం. విచక్షణా రహితమైన, వాణిజ్య ప్రేరితమైన ఇంగ్లీషు మీడియం చివరకు తెలుగు చదువులకే ఎసరుపెట్టడం వూహించని పరిణామం. ఇంగ్లీషును చదువుకోవద్దని ఆ భాషలోని విజ్ఞానం ఆధునికత ఆకళింపు చేసుకోవద్దని ఎవరూ చెప్పరు. కాని అసలు తెలుగు అక్షరాలు కూడా నేర్చుకోనవసరం లేకుండానే తెలుగుబిడ్డలు పరభాషలో చదువుకుని పరాయి దేశాలకు పరుగెత్తడం వారికీ దేశానికి కూడా శ్రేయస్కరం కాదు. దీనిపై గతంలో అనేక ఉద్యమాలు జరిగినా స్పందించని ప్రభుత్వాలు ఇప్పుడెందుకో కొంచెం కదలిక చూపిస్తున్నాయి. తెలంగాణ పాఠశాలల్లో తెలుగు ఒక బోధనాంశంగా వుండాల్సిందేనని ప్రభుత్వం ఆదేశించింది. ఆంధ్ర ప్రదేశ్‌లోనూ అలాటి ఒత్తిడి కొనసాగుతున్నది. ఇది స్వాగతించదగిన మార్పు. డిసెంబరులో హైదరాబాదులో తెలుగు మహాసభలు పెద్ద ఎత్తున జరపాలన్న ఆలోచన కూడా స్వాగతించదగింది. కొంతమంది తెలంగాణ భాష పేరిట పాక్షిక వాదనలు చేసినా ముఖ్యమంత్రి కెసిఆర్ తెలుగు సభలుగానే జరపాలని నిర్ణయించడం హర్షణీయం. రాష్ట్రాలు రెండైనా రెండు చోట్ల మాట్లాడే రీతిలో తేడాలు వున్నా తెలుగు భాష ఒక్కటే. లిపి ఒక్కటే. అందుకే ఈ సభలు అర్థవంతంగా జరగాలని కోరుకుందాం. ఆంధ్రప్రదేశ్‌లోనూ వీలునుబట్టి ఇలాటి కార్యక్రమాలు నిర్వహించుకోవచ్చు. ఇరు చోట్ల వున్న వైవిధ్య వైభవాన్ని కాపాడుకుంటూనే తెలుగు వెలుగులు విరజిమ్మే బాటలో సాగిపోదాం.

కవర్ పెయింటింగ్ : అలెగ్జాండర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్

## ఈ సంచికలో ...




సంపాదకవర్గం

తెలకపల్లి రవి (ప్రధాన సంపాదకుడు)

వొర ప్రసాద్ (వర్కింగ్ ఎడిటర్)

కె. సత్యరంజన్ • చీకటి దివాకర్

గనారా • శమంతకమణి

• కెంగార మోహన్

కె.లక్ష్మయ్య, మేనేజర్

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:

ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002, సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా

ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com

www.prasthanam.com

# శిలా సాదృశ్యం

- లలితానంద్
9247499715



కనులు మూసినా తెరచినా
సాక్షాత్కార అదృశ్యదృశ్యభీభత్సం
క్షతగాత్రమైన అక్షరం
రక్తసిక్తమైన అవని
ఆవిరై ఆకాశాన్నాక్రమించి
రుధిర ధారలతో శూన్యాన్నింపి
చప్పిడి లేకుండా ధరణిజేరి
క్షర మవుతున్న అక్షరం

♦

కళాకపోతం శాంతి రెక్కలు విరిచి
చైతన్యరాగ కోయల కుత్తుకలుత్తరించి
స్వేచ్ఛ ప్రవచించు పరిశుద్ధ ప్రజాస్వామ్య
ఇరవై ఒకటో శతాబ్దం – డిజిటల్ సాక్షిగా మాదే
సృజన పూవుల పరిమళాల, సౌందర్యాలు చిదిమి
మానవతను మట్టుపెట్టి
చిందులు వేయు సంస్కృతి మాది
కాలాన్ని మరల్చి, రోదసీలో పయనించి
సోక్రటీస్, క్రీస్తు, బ్రూనో, కోపర్నికస్‌ల
దగ్గరకు కొనిపోయే నాగరికత మాది
నీవు ఏమాలోచించి, భావించి, సృజించి
తిని, తిరిగి, ప్రవర్తించాలో బోధించి
తృణీకరించిన తుదముట్టించు
పూర్వ పరలోక వికాసం మాది
జ్ఞాన సూర్యుడికై–
అజ్ఞాన కొవ్వొత్తులతో అన్వేషించి
ఇంకుడు గుంటల్ని మహాసముద్రాలుగా భావించి
అసమానుల్ని సమానులుగా ప్రదర్శించి, ప్రభవించు
21వ శతాబ్దం సమకాలీన దర్పణంలో ముమ్మాటికీ మాదే
విశ్వవేదికగా.. సహజీవనం హరిస్తున్న
బహిరంగ జీవన రణరంగంలో
వర్ణాలన్నీ వివస్త్రలై విస్తుబోతున్నా
ఛిద్రమైన సహనసంస్కార దహన సంస్కారాల్లో
రమణీయ దృశ్యావిష్కరణ
మూలాల్లో పికిలి మొగ్గలై ఫలదీకరణ

♦

లోచన, ఆలోచనాభివ్యక్తులు అంతరించిన
కాలం కాలం చేసినట్లే
బాహ్యాంతర ద్రవశీలత ఘనీభవించినట్లే
ఘనమైన 'ఘనం' శిలా సదృశ్యమైనట్లే
ఎన్ని సహస్రాబ్దిలవసరమో శిలా విస్ఫోటనానికి!?

♦

## అక్టోబర్ నెల పురస్కారాలు

**వెన్నెలమ్మ జాతకం**
కథకు: **రూ.700/-**
రచయిత : గంగాధర్ వీర్ల

**పచ్చని చెట్టులా...**
కవితకు : రూ .500/-
రచయిత : పొనుగుమట్ల అశోక్ కుమార్

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారాల చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్



# సంపన్నులు

- ఎమ్వీ రామిరెడ్డి
9866777870

రామాంజనేయులు ఆ మాట చెప్పగానే ఆశ్చర్యపోయాను.

అతను మా ఆఫీసులో డ్రైవరుగా పని చేస్తున్నారు. మా ఇంటికి దగ్గర్లోనే ఉంటాడు కాబట్టి. నాకు డ్రైవింగ్ రాకపోయినా ఆ లోటు లేకుండాపోయింది. ఇద్దరం నా కారులోనే ఆఫీసుకు వెళ్లొస్తాం. వారాంతాల్లోగానీ, సెలవు దినాల్లో గానీ కుటుంబసభ్యులతో కలిసి బయటికి వెళ్ళాలన్నా అతనే నాకు ఆధారం.

ఆ రోజు ఆగస్టు 15. మా బాబు భాస్వంత్ పుట్టినరోజు. చందానగర్‌లో ఉన్న ఓ అనాథాశ్రమంలో పిల్లల మధ్య సెలబ్రేట్ చేయాలని ప్లాన్ చేశాను.

రామాంజనేయులు సహాయంతోనే అందరం అక్కడికెళ్లాం. కేక్ కట్ చేయించి, పిల్లలకు మిఠాయిలు పంచి, ఓ గంటసేపు గడిపి, వెనక్కి వచ్చాం.

కొద్ది రోజుల తర్వాత అతను ఆ మాట చెప్పగానే నేను ఆశ్చర్యపోయాను. ఒకరో ఇద్దరో కాదు, 26 మంది డ్రైవర్లను అతను చైతన్యపరిచి, ఆ కార్యక్రమం ప్లాన్ చేశాడు.

ఏటా మాదిరిగానే కంపెనీలో ఇంక్రిమెంట్లు ప్రకటించారు. డ్రైవర్లకు 15 నుంచి 20 శాతం జీతాలు పెరిగాయి. మామూలుగా వాళ్ల జీతాలే తక్కువ. 20 శాతం పెరిగినా అదేమంత అదనపు ఆర్థికబలం కాదు కానీ, రామాంజనేయులు వారందరినీ ఓ చోట సమావేశపరిచారు.

“అన్నా మనం పొద్దున్న డ్యూటీకి మన సార్లను తీసుకొస్తే, సాయంత్రం దాకా ఖాళీగనే ఉంటం. ఈ రూములో కూచొని బాతాఖానీ వేసుకుంటం. ఒకేల బైటికెల్లినా మన సార్లు మనకు మంచి భోజనం పెట్టిస్తరు. వారానికొక్క సారైనా ఏదో ఒక ఫంక్షన్‌కు పోతుంటం. రకరకాల వంటకాలు తింటం. ఏటా దసరా వచ్చిందంటే మామూళ్లు వసూల్జేస్తం.

ఇరవయ్యేలకు తగ్గకుండా వస్తయ్యి. మనం దావత్ చేసుకుంటం. తాగితే ఏమొస్తది..."

"మాంచి కిక్కొస్తది. ఆ మజాయే వేరు" గభాల్న అందుకున్నాడు సతీష్.

"లేదన్నా. డబ్బు నాశనం. ఆరోగ్యం నాశనం..." రామాంజనేయులు ఇంకేదో చెప్పబోతుండగా," ఈ సోదంతా ఆపి, సంగతేందో జెప్పర బై" అన్నాడు సీనియర్ డ్రైవర్ యాదగిరి.

'అడికే వత్తున్నానన్నా. ఈ మజ్జెన మా సారుతోని కలిసి ఓ అనాథాశ్రమానికెళ్లిన. ఆ పిల్లల్ని సూత్తే కడుపు తరుక్కుపోయింది. ముప్పై మంది బుడతలు. ఒక్కరికీ అమ్మానాన్నల్లేరు. ఎవరైనా వాళ్ల దగ్గరికొచ్చి స్వీట్లో చాక్లెట్లో పెడితే, అవురావురుమంటూ తింటరు. కళ్లనిండా సంతోషంతో కనిపిస్తరు."

"అయితే మనమేం జెయ్యగలం?"

"చెయ్యగలం అన్నా. ఒక్కరోజు వాళ్లతో గడుపుదాం. మనకి ఈ నెల నుంచి జీతం పెరిగింది. పెరిగిన మొత్తం ఒక్క నెలకు మనది కాదనుకుందాం. ఆ ఆశ్రమానికి ఇద్దాం."

ఒకటిన్నర దశాబ్ద కాలంగా సామాజిక సేవావిభాగంలో పనిచేస్తున్న నాకు... ఆ నాలుగు మాటలకే వాళ్లంత తేలిగ్గా ఒప్పుకోరని తెలుసు.

ఆ తర్వాత ఇంకెన్ని సార్లు వాళ్లను కలిశాడో, ఎంతగా బతిమాలాడో తెలియదు గానీ, మొత్తానికి అందరినీ ఒప్పించాడు రామాంజనేయులు.

ఆ రోజు పన్నెండు కావొస్తోంది.

రామాంజనేయులు ఫోన్ చేశాడు. "సార్, అందరం హోమ్‌కొచ్చాం. మీరోసారి వచ్చిపోతారా?"

"నేనొస్తే మీ వాళ్లు ఫ్రీగా ఉండలేకపోవచ్చు. మీరు కానీయండిలే" అన్నాను.

కానీ ఉండలేకపోయాను.

రామాంజనేయులు మాటలు నమ్మి, అక్కడిదాకా వచ్చినందుకు మిగతావారు పిల్లల మొహాల్లోని చిరునవ్వులతో సంతృప్తి చెందుతారా?



సరికొత్తగా చిరుదానాలతో ఒరిగేదేమి ఉండదని, దిక్కులేని పిల్లల్ని ఆదుకోవడం అంత సులభం కాదనీ ఓ తొందరపాటు అంచనాకు వస్తారా?

రకరకాల అనుమానాలు నన్ను నిలవనీయలేదు.

చకచకా బయల్దేరి, ద్విచక్రవాహనంపై మా ఇంటికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆ ఆశ్రమానికి వెళ్లాను. అక్కడి దృశ్యాన్ని చూస్తూనే ఆశ్చర్యపోయాను.

ముప్పైమంది చిన్నారుల చుట్టూ పాతిక మంది డ్రైవర్లు దడి కట్టారు. మధ్యలో, పిల్లలు హిందీ పాటకు డ్యాన్స్ వేస్తుంటే, వీళ్లు ఈలలు వేసన్తా, కాలు కదుపుతూ ఉత్సాహపరుస్తున్నారు.

నేను దూరంగా నిలబడి చూస్తుండిపోయాను.

పాట అయిపోగానే, నన్ను చూసి అందరూ విష్ చేశారు. దగ్గరగా వెళ్లి ఓ కుర్చీలో కూచున్నాను.

ఆశ్రమ నిర్వాహకురాలు రోజీ వచ్చి, "నమస్తే సార్" అంది.

ప్రతి నమస్కారం చేస్తూ, "ప్లీజ్ కంటిన్యూ" అన్నాను.

మరో గంటసేపు ఆటలూ పాటలూ నృత్యాలూనూ.

సతీష్, యాదగిరిల మొహాల్లో వింత వెలుగు. చిన్నపిల్లల్ని మార్చి మార్చి ఎత్తుకుని ఆడించారు.

ఆ తర్వాత రోజే పిల్లలందరినీ ఓ చోట కూచోబెట్టింది. వాళ్ల ముందు డ్రైవర్లందరూ నిలబడ్డారు. ఎదురుగా పది బస్తాల బియ్యం, ఉప్పు, చింతపండు, బెల్లం తదితరాలున్నాయి.

నన్ను పిలిచి, నా చేతుల మీదుగా వాటిని హోమ్‌కు అందజేయమన్నారు.

"ఈ క్రెడిట్ మీకే దక్కాలి. మీరే అందించండి" అంటూ వాళ్ల ద్వారానే రోజీకి అందజేయించాను.

కేక్ కట్‌చేసి, పిల్లలందరికీ పంచారు. తమ కళ్లెదుటే కేకుముక్క చాక్లెట్లు, బిస్కెట్లు నోరూరిస్తున్నా, పిల్లలెవ్వరూ వాటిమీద చెయ్యి వెయ్యలేదు. చేతులు జోడించి కళ్లు మూసుకుని, ప్రార్థన చేశారు. "మాకీ రోజు అండగా నిలిచిన అన్నలందరికీ మా నమస్కారాలు. వాళ్లను ప్రభువు చల్లగా

చూడాలి' అని పలుకుతూ ప్రార్థన ముగించారు.

భోజనాలు మొదలయ్యాయి. వీళ్లంతా స్పాన్సర్ చేయడంతో ఆ రోజు బిర్యానీ, చికెన్ వండించారు. వీళ్లే వడ్డించారు. పిల్లలకు దగ్గరుండి తినిపించారు. వాళ్లూ కూచుని తిన్నారు.



అందరం కుర్చీల్లో కూచొని ఉండగా, రోజీ ఓ బాబును పిలిచింది. "నువ్వెలా ఇక్కడికొచ్చావో చెప్పు" అంది.

"మా అయ్య లారీడ్రైవరు. ఎయిడ్స్ వచ్చి చచ్చిపోయాడు. ఆర్నెల్ల తర్వాత మా అమ్మ కూడా అదే జబ్బుతో చచ్చిపోయింది. మా ఊరి ప్రెసిడెంటు గారు నన్నిక్కడికి తీసుకొచ్చారు."

"ఇప్పుడేం చదువుతున్నావు?"

"మూడో తరగతి"

రోజీ మరో పాపను పిలిచింది.

ఆ పాప అందుకుంది...

"అదుగో, అక్కడ... గోడ పక్కన నీళ్లతో ఆడుకుంటన్నాడే, ఆడు నా తమ్ముడు. అక్కడ కూకొని ఉన్న ఎర్రలంగా అమ్మాయి మా అక్క. మా అయ్య రోజూ తాగొచ్చి, అమ్మనీ, మమ్మల్నీ తెగ కొట్టేవాడు. తాగిన మత్తులోనే లారీ కిందపడి చనిపోయాడు. మమ్మల్ని సాకటం అమ్మకు శానా కష్టమయింది. రెణ్ణెల్ల కిందట ఓ రోజు మా ముగ్గురినీ చెరువు దగ్గరకు తీసుకుపోయింది. మమ్మల్ని ఒడ్డునే కూచోమని చెప్పి, ఆమె చెరువులో దూకేసింది. మేం ఏడుత్తుంటే, పోలీసులు పట్టుకెళ్లి, ఈ హోమ్‌కు తీసుకొచ్చారు..."

చెప్పడం పూర్తి కాకముందే భాస్కర్ అనే డ్రైవర్ ఒక్కపెట్టున ఏడ్చేశాడు. నేను సముదాయించాను.

"ఇక్కడ అక్క మమ్మల్ని బాగా చూసుకుంటుంది. ముగ్గురం చదువుకుంటున్నాం. సంతోషంగా ఉంటున్నాం." అంటున్నప్పుడు ఆ పిల్ల కళ్ళల్లో సూర్యకాంతి.

మరో పాపను పిలిచి పాట పాడమంది రోజీ. ఆ పాప అయిదు పాటలు పల్లవి వరకే పాడింది. అన్నీ 'అమ్మ'కు సంబంధించిన పాటలే, పాడటం ఆపేసి, మాటలు మొదలు పెట్టింది.

"నా పేరు శిరీష. మా అమ్మ నా చిన్నప్పుడే చచ్చిపోయింది. అమ్మంటే నాకు చాలా ఇష్టం. అందుకే అమ్మ మీద ఉన్న సినిమా పాటలన్నీ నేర్చుకున్నాను. నాన్న ఇంకో పెళ్లి చేసుకున్నాడు. పిన్ని నన్ను బాగా తిట్టేది. అల్లరి చేస్తున్నావంటూ తెగ కొట్టేది. ఒకరోజు నేను దొంగతనంగా బెల్లం తిన్నానని, అట్లకాడ కాల్చి, నా చేతుల మీద వాతలు పెట్టింది. బేల్దారు పనికెళ్లిన నాన్న అప్పుడే ఇంటికి తిరిగొచ్చాడు. పిన్నీ నాన్నా పోట్లాడుకున్నారు. చివరికి నాన్న పిన్నిని బతిమాలాడు. అయినా ఆమె విన్లేదు. తక్షణం నా ఇంటినుంచి దాన్ని తరిమెయ్యకపోతే, ఇంట్లో నేను క్షణం కూడా ఉండను... అంటూ నాన్న మీద ఇంతెత్తున లేచింది. ఇంక చేసేదేం లేక, నాన్న నన్ను ఇక్కడికి తీసుకొచ్చి, రోజీ అక్కకు అప్పగించాడు..."

అందరూ పన్నెండేళ్ల లోపు బాలబాలికలే.

ఒక్కొక్కరిదీ ఒక్కో కన్నీటి కథ. కానీ వారి మొహాల్లో ఆ దుఃఖాలేవీ కనిపించవు.

కళ్లల్లో నిరాశ కనిపించదు. జీవితంపై గొప్ప భరోసాతో ఉన్నట్టుగా కనిపిస్తారు.

చిన్న సమస్యకే కుంగిపోయే సోకాల్డ్ ఉద్యోగులకు పాఠ్యాంశాల్లా కనిపిస్తారు.

సాయంత్రం నాలుగు దాటుతుండగా మేమంతా బయల్దేరాం. పిల్లలకు వీడ్కోలు చెప్పి.

రోజీ మరీమరీ కృతజ్ఞతలు చెప్పింది.

నేను బయటికొచ్చి, బైక్ తీస్తుండగా యాదగిరి వచ్చాడు.

"సార్, ఏమో అనుకున్నగానీ, ఇందులో ఉండే కిక్కే వేరు. ఈ మజాయే వేరు" అన్నాడు.

నేను నవ్వుతూ అతడి భుజం తట్టి, బండిని ముందుకు దూకించాను.

నాకు తెలుసు, వాళ్లిక తరచూ 'తృప్తి' అనే మత్తులో తడిసి ముద్దవుతారని!

చేసేది డ్రైవర్ ఉద్యోగమే కావచ్చు. నా దృష్టిలో వాళ్లు నిజమైన సంపన్నులు. సేవాసంపన్నులు.

# వీరావేశ కవనం..?

- పత్తి సుమతి
8790499405



ఇది నా వీరావేశ కవనం కానే కాదు
క్రోధ వ్యధా పూరిత హృదయాక్రోశం...
మహోజ్వలంగా, మనోజ్ఞంగా ఎదగవలసిన దేశం
మహాతలంలోకి కూరుకుపోతోంది...
తానేమీ చేయలేక కాలచక్రం గిర్రు గిర్రున...
తిరుగుతూనే వుంది....
అవినీతి అనకొండ అదుపులేక పెరుగుతూనే వుంది
వర్ధంతులు - జయంతుల సందడితో
నాలుగు రోడ్ల కూడల్లో విగ్రహాల ఎత్తులు పెరుగుతూనే ఉన్నాయి....
ఎటు చూసినా ఏమున్నది గర్వకారణం!?!
స్వార్థం - పిచ్చికుక్కలా పెరుగుతూంటే...!?
అమ్మడం - కొనడమనే విష సంస్కృతిలో
విద్యల తల్లి భీతిల్లుతుంటే...
క్షణానికి కొక పరీక్షల ఒత్తిడిలో...
ఊపిరాడక ఆత్మహత్యల పరంపరలలో...
కన్నవారి ఆర్తనాదాల భుగభుగలు తప్ప
అదుగో ... అదుగో చూడనా...
అంతస్తుల మేడ నుండి దూకిన వైనం...
ఇదిగో చూడు - మెడికో మౌనిక-
మెడకు తానే ఉచ్చు బిగించుకున్న తీరు
ఆధునిక భారతంలో పందొమ్మిదవ ఆత్మహత్యల పర్వం-
ఘోషలు విరామ మెరుగక మ్రోగుతుంటే...
మన మహా గొప్ప మేధావుల మస్తిష్కాలు
'మిడియోక్రిటీ'తో మేట వేస్తుంటే...
మూసికా మార్జాల మందహాసంతో...
సరస్వతీ నిలయాలలో దుర్యోధన, దుశ్శాసన-
కీచకుల 'ఎంట్రీస్' జోరుగా, హోరుగా
సాగుతూ వుంటే...
అనిబిసెంట్ సృజించిన 'న్యూ ఇండియా'
కలాం కలలు గన్న 'గ్రేట్ ఇండియా' గుండుసున్నా
ఓనా! భారతదేశ నిఖార్సయిన మేధావులారా!
ఇప్పటికైనా కళ్లు తెరవండి...
దేశం కోసం త్యాగం చేసిన అల్లూరి, అజాద్, భగత్‌సింగ్‌ల్లా
ప్రళయ ఘోషలా ఉరకండి!
ప్రగతి విరోధుల జలగల దండును...
కణకణ మండే కాగడాలతో కాల్చండి, తరిమివేయండి
విద్యార్థులే మన 'పట్టుగొమ్మలు'
'మహా సబ్‌ట్యూట్స్ కట్టుకథలతో అన్యాయమైపోతున్నారు
'సరస్వతీ పీఠాలు' నడుస్తోన్న అస్థిపంజరాల్లా-
విలవిలలాడుతున్నాయి
బతికేందుకే పదే పదే చస్తున్న వాళ్లే ఇక్కడ కనిపిస్తున్నారు
ఒక చేగువేరా, ఒక ఫైడల్ కాస్ట్రో, ఒక మావో
ఒక అంబేద్కర్, ఒక నేతాజీల సాహస చరిత్రలు
మళ్లీ మళ్లీ తిరగేసి
సమర శంఖం పూరిస్తూ
భావ వేగం ప్రసరిస్తూ... రక్షించండి... రక్షించండి...
మనకోసం - మన మనుమల కోసం -
మనుమరాళ్ల కోసం - భావి తరాల కోసం
నవత, సమత, భవిత కోసం...
ఇది నా వీరావేశ కవనం కానే కాదు
క్రోధ వ్యథాపూరిత హృదయాక్రోశం.... ◆

# రాయలసీమ తొలికథా సాహిత్యం - రచయిత్రులు

- డా॥ తవ్వా వెంకటయ్య
9703912727



*తెలుగునేలపై ఉన్న నాలుగు ప్రాంతాలవారు తమతమ సాహిత్యాన్ని ప్రాంతీయ అస్తిత్వం దృష్టితో పరిశీలిస్తున్నారు. ఆయా పరిశీలనలలో పరిశోధనలలో ఎన్నో నూతన విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. అందులో భాగంగా **2014** జనవరి **28, 29**న కర్నూలులో వెల్దండి శ్రీధర్ ఆధ్వర్యంలో 'తెలుగు కథ - ప్రాంతీయ అస్తిత్వం' అనే అంశంపై రెండు రోజుల యు.జి.సి. జాతీయ సదస్సు జరిగింది. ఆ సదస్సులోని పత్రాలన్నింటిని అదే పేరుతో **2015**లో వ్యాస సంకలనంగా వెలువరించారు. ఈ ప్రాంతీయ అస్తిత్వ సాహిత్య అధ్యయనంలో భాగంగా జరిగిన పరిశోధనలో రాయలసీమ కథకు సంబంధించి ఎన్నో నూతన విషయాలు వెలుగులోకి వచ్చాయి.*

**18,** 19వ శతాబ్దాలకు ముందు భారతీయ స్త్రీ పూర్తి అణచివేతకు, దోపిడికి గురైంది. ఇదే సమయంలో యూరోపియన్ల రాక జరిగింది. యూరోపియన్లు తమ మిషనరీల ద్వారా పాశ్చాత్యవిద్యను ప్రవేశపెట్టారు. దాంతోపాటుగా పాశ్చాత్య సాహిత్యం కూడా భారతీయ సంస్కర్తలకు పరిచయం అయ్యింది. పాశ్చాత్య విద్య, పాశ్చాత్య సాహిత్యం, అక్కడి సామాజిక పరిస్థితులు భారతీయులను తీవ్రంగా ప్రభావితం చేశాయి. యూరోపియన్లు భారతదేశం రాకముందు భారతీయ సమాజంలో పాతుకుపోయిన అనేక దురాచారాలు, సంప్రదాయాలు స్త్రీ జీవితాన్ని అన్ని విధాలుగా ధ్వంసం చేశాయి. ఈ విషయాన్ని పాశ్చాత్యదేశాల సామాజిక అంశాలతో పోల్చుకున్న మన సంస్కర్తలు గుర్తించారు. భారతీయ సమాజంలో పాతుకుపోయిన దురాచారాలను నిర్మూలించాలనుకున్నారు. ముఖ్యంగా భారతీయ సమాజంలో నిర్లక్ష్యానికి, అన్యాయానికి గురౌతున్న స్త్రీని ఉద్ధరించాలనుకున్నారు. ఆ ఆలోచనలే సంఘసంస్కరణ రూపంలో ఆచరణలోకి వచ్చాయి. అందులో భాగంగా స్త్రీని సాంఘిక బంధాల నుండి విముక్తి చేయాలనుకున్నారు. వాటిని కార్యరూపం దాలుస్తూ బాల్యవివాహాలను, కన్యాశుల్కాన్ని నిషేధించారు. వితంతుస్త్రీలకు పునర్వివాహాలను చేశారు. స్త్రీకి చదువు నేర్పించారు. ఈ చర్యలవల్ల నాటి స్త్రీ వెలుగుబాటలవైపు పయనించగల్గింది. దీంతో స్త్రీలు బాహ్యప్రపంచాన్ని నిశితంగా పరిశీలిస్తూ సమాజాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించారు. పురుషులతోపాటు అన్ని సాంఘిక, రాజకీయ సాహిత్య రంగాలలో విస్తృతంగా రాణించారు. దీంతో స్త్రీలు స్వతంత్ర ఆలోచనలు చేయడం ప్రారంభించారు. కొందరు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. కేసులకు భయపడకుండా జైళ్ళకెళ్ళారు. మరికొందరు సంఘసంస్కరణకు నడుం బిగించారు. ఇంకొందరు సాహితీ సృజనవైపు కలం కదిపారు. ఇలా అలనాటి స్త్రీ బహుముఖంగా తమకు అందివచ్చిన అన్ని అవకాశాలను ఉపయోగించుకున్నారు.

తాము పురుషులకేమాత్రం తీసిపోమంటూ ముందుకు నడిచారు. అలనాటి స్త్రీలు పాశ్చాత్య విద్యను, పాశ్చాత్య సాహిత్య గ్రంథాలను చదివి తమలో కలుగవలసిన నూతన చైతన్యం గురించి తర్కించుకున్నారు. దాని ఫలితంగా వివిధ రంగాలలో

తమదైన శైలిలో స్త్రీలు రాణించారు. అందులో సాహితీరంగం ఒకటి. ప్రాచీన సాహిత్యంలో తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, తరిగొండ వెంగమాంబ వంటి చాలామంది కవయిత్రులు రాణించారు. కానీ 18, 19వ శతాబ్దంలో యూరోపియన్ సాహిత్యం నుండి ఆధునిక సాహిత్య ప్రక్రియలు దిగుమతి కాబడ్డాయి. నవల, కవిత్వం, కథ, నాటకం వంటివి ఆధునిక సాహిత్య ప్రక్రియలుగా సాహిత్య విమర్శకులు ఆమోదించారు. ఇప్పుడు ఆధునిక కథాసాహిత్య ప్రక్రియ గురించి చూద్దాం.

**తొలి తెలుగు కథా సాహిత్యం స్త్రీ కేంద్రీకృతంగానే కొనసాగింది. అటువంటిది స్త్రీలే తొలికథా సాహిత్యంలో ప్రధానమైన పాత్రపోషించడం చాలా గొప్ప విషయం.**

తెలుగులో తొలి ఆధునిక కథగా గురజాడ అప్పారావు 1910లో రాసిన 'దిద్దుబాటు'ను సాహిత్య విమర్శకులు ఆమోదించారు. కానీ గురజాడ కంటే ముందే ఆధునిక తెలుగు కథలున్నట్లు తెలంగాణా సాహిత్య పరిశోధకులు సంగిశెట్టి శ్రీనివాస్ తెలియజేశాడు. అందుకు సాక్ష్యంగా 'బండారు అచ్చమాంబ' 1902 ప్రాంతంలో రాసిన కథలను బయట పెట్టాడు. ఈ విషయాన్ని మరింత విస్తృతపరుస్తూ 2015 జనవరిలో వివినమూర్తి గురజాడ 'దిద్దుబాటు' కథ కంటే ముందున్న 92 కథలను సంకలనంగా వెలువరించాడు. ఇందులో 61 కథలను 23 మంది కథకులు రాశారు. వారిలో 13మంది రచయిత్రులు కాగా 10మంది రచయితలు. మిగిలిన 31 కథలకు కథకులెవరో తెలియరాలేదన్నారు సంపాదకులు. గురజాడ కంటే ముందు కథా రచన చేసిన కథకులలో 13 మంది రచయిత్రులున్నారంటే ఆధునిక సాహిత్య ప్రక్రియలలో స్త్రీల భాగస్వామ్యాన్ని అంచనా వేయవచ్చు. గురజాడ కంటే ముందు కథారచన చేపట్టిన 13 మంది రచయిత్రులకు మార్గదర్శి బండారు అచ్చమాంబ. ఈమె 1898 నుండి కథలు రాసినట్లు కె.కె. రంగనాథాచార్యులు 'తొలినాటి తెలుగు కథానికలు' అనే గ్రంథంలో తెలియజేశాడు. కె.కె. రంగనాథాచార్యులు, వివినమూర్తి గార్లు వెలువరించిన ప్రకారం బండారు అచ్చమాంబ 1898-1904 మధ్యకాలంలో 14 కథలు రాసింది. ఆధారాలు లభిస్తున్నంతలో బండారు అచ్చమాంబ తొలి తెలుగు కథారచయిత్రి. మరికొందరు ఆధునిక తెలుగు కథా సాహిత్యం బండారు అచ్చమాంబతోనే ప్రారంభం అయ్యిందంటున్నారు. ఇంకొందరు 1895లో కథలు రాసిన రాయసం వెంకటశివుడు తొలి తెలుగు కథకులుగా ఆమోదించడాన్ని పరిశీలిస్తున్నారు. ఏది ఏమైనప్పటికీ తొలి తెలుగు కథారచయిత్రులు ఎంతో చైతన్యవంతంతో కథలు రాశారు. తొలి తెలుగు కథా సాహిత్యం స్త్రీ కేంద్రీకృతంగానే కొనసాగింది. అటువంటిది స్త్రీలే తొలికథా సాహిత్యంలో ప్రధానమైన పాత్రపోషించడం చాలా గొప్ప విషయం. తెలుగు కథకు గురజాడ ఒక విభజన రేఖ. గురజాడకు ముందు తెలుగు కథ, గురజాడ తర్వాత తెలుగు కథ అని విభజించి చూస్తే తెలుగు కథాసాహిత్యం మరింత విపులంగా అర్థం అవుతుంది. తొలితెలుగు కథా సాహిత్యం ఎవరితో మొదలైందనే వాదన కాస్త పక్కన పెట్టి ఆలోచిస్తే తొలితెలుగు కథా సాహిత్యంలో రచయిత్రులది ప్రధాన భూమిక అనే విషయాన్ని ఆమోదించవలసిందే.

ఇక రాయలసీమ కథా సాహిత్యం విషయానికొస్తే 1941లో జి. రామకృష్ణ రాయలసీమ తొలి కథకుడుగా సాహిత్య విమర్శకులు ఆమోదించారు. కానీ కొంతకాలంగా ప్రాంతీయ అస్తిత్వాల ఉద్యమాలు తీవ్రరూపం దాల్చాయి. అవి క్రమంగా సాహిత్యంలోకి చొరబడ్డాయి. ఫలితంగా తెలుగునేలపై ఉన్న నాలుగు ప్రాంతాలవారు తమతమ సాహిత్యాన్ని ప్రాంతీయ అస్తిత్వం దృష్టితో పరిశీలిస్తున్నారు. ఆయా పరిశీలనలలో పరిశోధనలలో ఎన్నో నూతన విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. అందులో భాగంగా 2014 జనవరి 28, 29న కర్నూలులో వెల్దండి శ్రీధర్ ఆధ్వర్యంలో 'తెలుగు కథ - ప్రాంతీయ అస్తిత్వం' అనే అంశంపై రెండు రోజుల యు.జి.సి. జాతీయ సదస్సు జరిగింది. ఆ సదస్సులోని పత్రాలన్నింటిని అదే పేరుతో 2015లో వ్యాస సంకలనంగా వెలువరించారు. ఈ ప్రాంతీయ అస్తిత్వ సాహిత్య అధ్యయనంలో భాగంగా జరిగిన పరిశోధనలో రాయలసీమ కథకు సంబంధించి 'ఎన్నో నూతన విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఈ రాయలసీమ అస్తిత్వ సాహిత్య అధ్యయనానికి మార్గదర్శి ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి. 2010-2014 మధ్య రాయలసీమ తొలికథలపై జరిగిన పరిశోధనలో చాలా ఆశ్చర్యకర విషయాలు బయటపడ్డాయి. అంతవరకు రాయలసీమ తొలికథకుడుగా 1941 నాటి జి. రామకృష్ణను చెప్పుకునేవారు. కానీ నా ఈ పరిశోధనలో

రాయలసీమ కథ 1926 జూలైలో అయ్యగారి నరసింహమూర్తి రాసిన 'మతభేదం'తో మొదలైనట్లు వెల్లడైంది. ఆ కథ 1926 జూలై నుండి 1930 డిసెంబర్ వరకు ప్రొద్దుటూరు నుండి నడిచిన 'భారత కథానిధి' మాసపత్రికలో ప్రచురితం అయ్యింది. ఈ పత్రికలో 75 కథలు ప్రచురితం అయ్యాయి. ఇదే సమయంలో అనంతపురం నుండి డా॥ అప్పిరెడ్డి హరినాథ రెడ్డి శ్రీసాధన వారపత్రికను వెలుగులోకి తెచ్చాడు. శ్రీసాధన పత్రిక 1926 ఆగష్టు 14న ప్రారంభమై 1941 వరకు 30 కథలను ప్రచురించినట్లు అప్పిరెడ్డి హరినాథరెడ్డి తెలియజేశాడు. అయితే శ్రీసాధనలోని 30 కథలలో 6 కథలకు రచయిత లెవరో తెలియదని హరినాథరెడ్డి తెల్పాడు. మిగిలిన 24 కథలను 9 మంది రచయితలు రాశారు. వారిలో చాలా వరకు అనంతపురం జిల్లావారే. మరికొందరు ఏ ప్రాంతంవారో తెలియరాలేదు. కానీ భారత కథానిధి మాసపత్రికలో 75 కథలు ప్రచురితం అయ్యాయి. ఈ కథలన్నింటిని రాయలసీమ నాలుగు జిల్లాలకు చెందిన 31 మంది కథకులు రాశారు. వారిలో నెల్లూరు జిల్లాకు చెందిన ఒకరిద్దరు కథకులున్నారు. వారిలో నలుగురు కథారచయిత్రులున్నారు. ఈ భారతకథానిధి మాసపత్రిక ద్వారా రాయలసీమ కథా ప్రారంభం 1941 నుండి 1926 జూలైగా నిర్ధారణ అయ్యింది. శ్రీసాధనలో 1926 అక్టోబర్‌లో రచయిత పేరు లేకుండా 'ఒక చిన్న కథ' పేరుతో కథ వచ్చింది. అదీ అసమగ్రంగా ఉంది. తర్వాత 1927 జూలైలో రామచంద్ర అనే రచయిత 'ఇరువురు యాత్రికులు' పేరుతో కథ రాశాడు. ఈ విషయాలు ఇలా ఉండగా తెలంగాణా సాహిత్య పరిశోధకుడు సంగిశెట్టి శ్రీనివాస్ 1918లోనే సీమ కథ మొదలైనట్లు తెలియజేశాడు. ఆ కథ పేరు 'కడపటిపైసా' ఇది 'సౌందర్యవల్లి' పత్రికలో ప్రచురితం అయినట్లు చెప్పాడు. కానీ ఈ కథారచయిత ఎవరనేది తెలియరాలేదన్నాడు. తర్వాత 2015లో వివిన మూర్తి సంపాదకత్వంలో వచ్చిన 'దిద్దుబాటలు' సంకలనంలో దిద్దుబాటు కంటే ముందు 92 కథలలో 1882లో జనవినోదినిలో వచ్చిన 'ఒక సంవత్సరము పల్లెటూరి యందునికి లేక ఋతుచర్య' అనే కథను ప్రచురించాడు. ఈ కథకు రచయిత ఎవరో తెలియనప్పటికీ ఈ కథ కడప జిల్లా రాజంపేట దగ్గరలోని సోమేశ్వరంలో జరుగుతుంది. అందువల్ల ఇది రాయలసీమ కథగా అంగీకరించవచ్చా లేదా అనే విషయం సాహిత్య విమర్శకులు నిర్ధారించాలి. ఏది ఏమైనా ఇంతవరకు చూసిన అన్ని అంశాలను పరిశీలిస్తే 1926 జూలై నాటి 'మతభేదం' కథను రచయిత తెలిసిన, సమగ్రంగా అందుతున్న తొలి సీమకథగా గుర్తించవలసి ఉంది. రాయలసీమ తొలి కథా సాహిత్య నిర్మాణంలో 'భారత కథానిధి' మాసపత్రిక ప్రాధాన్యత సంతరించుకున్నది. ఇందులో వచ్చిన 75 కథలలో 50 కథలు సంకలనాలుగా వెలువడ్డాయి. మిగిలిన 25 కథలు త్వరలో వెలువడనున్నాయి. ఈ 75 కథలను 31 మంది కథకులు రాశారు. వారిలో నలుగురు కథా రచయిత్రులున్నారు.

రాయలసీమ కథా ప్రారంభం 1926 జూలై అనుకున్నా లేదా 1918 అనుకున్నా లేదా 1882 అనుకున్నా అప్పటి నుండి ఇప్పటి వరకు 200 మంది కథారచయితలు, 44 మంది కథారచయిత్రులున్నారు. తెలుగు కథకు గురజాడ అప్పారావును ఒక విభజన రేఖ అనుకున్నట్లే, రాయలసీమ కథకు జి. రామకృష్ణ ఒక విభజన రేఖ. ఎందుకంటే జి. రామకృష్ణ రాసిన 1941 నాటి 'చిరంజీవి' కథతోనే రాయలసీమ ప్రాంతీయ అస్తిత్వం వస్తువుగా ప్రతిబింబిస్తుంది. జి. రామకృష్ణ కంటే ముందునాటి రాయలసీమ కథా సాహిత్యం సంఘసంస్కరణ దృక్పథంతో వెలువడింది. 1941 ముందటి రాయలసీమ కథాసాహిత్యంలో 31 మంది కథకులుండగా వారిలో నలుగురు కథా రచయిత్రులు. వీరు చిత్తూరు జిల్లాకు చెందిన మామిడి రుక్మిణమ్మ, కడప జిల్లాకు చెందిన పూండి చెల్లమ్మ, డి. పాపమ్మ, కర్నూలు జిల్లాకు చెందిన అలువేలమ్మ. పై నలుగురు 1927–29 మధ్యలో 'భారత కథానిధి' మాసపత్రికలో కథలు రాశారు. కానీ ఈ నలుగురికంటే ముందు 1925లో అనంతపురానికి చెందిన కస్తూరి వెంకటసుబ్బమ్మ 'కథామంజరి' పేరుతో కొన్ని కథలను సంకలనంగా వెలువరించింది. అయితే ఆ 'కథామంజరి' సంకలనంలోని కథలు పురాణ, ఇతిహాసాలకు సంబంధించినవి. అందులో భీష్మోదయం, గరుడ చరిత్రం, బలిచక్రవర్తి చరిత్రం వంటి కథలున్నాయి. అందువల్ల ఈ కథలను ఆధునిక కథలుగా ఆమోదించలేం. కానీ రాయలసీమలో కథారచనకు శ్రీకారం చుట్టిన

***రాయలసీమ కథా ప్రారంభం 1926 జూలై అనుకున్నా లేదా 1918 అనుకున్నా లేదా 1882 అనుకున్నా అప్పటి నుండి ఇప్పటి వరకు 200 మంది కథారచయితలు, 44 మంది కథారచయిత్రులున్నారు.***

తొలికథారచయిత్రిగా కనస్తూరి వెంకటసుబ్బమ్మను గుర్తించాల్సి ఉంది. ఈమె 'కథామంజరి'తోపాటు సుగ్రీవ పట్టాభిషేకం, శాకుంతల నాటకమును రచించింది.

కస్తూరి వెంకటసుబ్బమ్మ తర్వాత రాయలసీమలో ఆధునిక కథారచనకు శ్రీకారం చుట్టిన కథారచయిత్రి మామిడి రుక్మిణమ్మ. ఈమె చిత్తూరు జిల్లావాసి. ఈమె 1927 జనవరిలో భారతకథానిధి మాసపత్రికలో 'సుందరి' అనే కథ రాసింది. ఈమెతోపాటు ఇదే సంచికలో మదనపల్లెకు చెందిన ఎం.వి. పాపన్నగుప్త 'శారద' కథను రాశాడు. ఒకే సంవత్సరం ఒకే సంచికలో వీరిద్దరి కథలు వెలువడ్డాయి. అందువల్ల చిత్తూరు జిల్లా తొలి కథకులుగా మామిడి రుక్మిణమ్మ, ఎం.వి. పాపన్న గుప్తలను చెప్పుకోవాలి. వీరిద్దరి కథలు వెలుగులోకి రాకముందు చిత్తూరు జిల్లా తొలికథకుడిగా కె. సభాను చెప్పుకునేవారు. ఈయన 1944లో 'కడగండ్లు' కథతో తమ కథాసాహిత్యం ప్రారంభించాడు. తొలి చిత్తూరు జిల్లా కథా రచయిత్రిగా ఆర్. వసుంధరాదేవి (1967)ని చెప్పుకునేవారు. అయితే వారిద్దరి కంటే ముందే కథారచన చేపట్టిన మామిడి రుక్మిణమ్మ ఎం.వి. పాపన్నగుప్తలు చిత్తూరు జిల్లా తొలికథకులుగా చెప్పుకోవాలి. మామిడి రుక్మిణమ్మ రాసిన 'సుందరి' అనే కథ ఆదర్శవంతమైన ప్రేమ కథ. ఇందులో రాజేశ్వరరావు, రాజేశ్వరీల కూతురు 'సుందరి'. వీరు తమ కూతుర్ని అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేస్తారు. పెళ్ళీడుకొచ్చాక పెళ్ళి సంబంధాలు చూస్తుంటారు. అయితే సుందరి, తన మేనత్త కొడుకు సుబ్రహ్మణ్యం ఒకరినొకరు ప్రేమించుకుని పెళ్ళి చేసుకోవాలనుకుంటారు.

రాజేశ్వరరావుకు స్వయాన చెల్లెలు కొడుకైన సుబ్రహ్మణ్యం చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోగా మేనమామ పెంచి పెద్ద చేస్తాడు. స్వయాన మేనల్లుడే అయినప్పటికీ తన కూతురు సుందరి, సుబ్రహ్మణ్యాన్ని పెళ్ళి చేసుకుంటానంటే అంగీకరించడు. కారణం సుబ్రహ్మణ్యం నిరుపేద కావడమే. కానీ సుందరి తాను సుబ్రహ్మణ్యాన్ని తప్ప వేరొకరిని పెళ్ళి చేసుకోనని తెగేసి చెప్తుంది. కాదంటే ఆత్మహత్య చేసుకుంటా నంటుంది. దీంతో దిక్కుతోచని రాజేశ్వరరావు సుందరి-సుబ్రహ్మణ్యాలకు పెళ్ళి చేస్తాడు.

**తండ్రి ఆలోచనలను ప్రతిఘటించి తన ప్రేమను గెలిపించుకుంటుంది. 1927 ప్రాంతంలో ఇంత గొప్ప సామాజిక చైతన్యంతో స్త్రీ సమస్యపై ఒక స్త్రీ కథ రాయడం నిజంగా చాలా గొప్ప విషయం.**

ఎంతో తిరుగుబాటు ధోరణిలో సాగిన ఈ కథలలో భూస్వామ్య భావాలు కలిగిన తండ్రి రాజేశ్వరరావు. ఆస్తి అంతస్థుల వ్యత్యాసం చూపి కన్నకూతురి ప్రేమను దూరం చేయాలనుకుంటాడు. కానీ సుందరి సామ్యవాద భావాలు కలిగిన యువతి. అందువల్ల తండ్రి నియంతృత్వాన్ని ధిక్కరించి ఆస్తిపాస్తుల కంటే ప్రేమ, మానవత్వం వైపు మొగ్గు చూపుతుంది. తండ్రి ఆలోచనలను ప్రతిఘటించి తన ప్రేమను గెలిపించుకుంటుంది. 1927 ప్రాంతంలో ఇంత గొప్ప సామాజిక చైతన్యంతో స్త్రీ సమస్యపై ఒక స్త్రీ కథ రాయడం నిజంగా చాలా గొప్ప విషయం.

మామిడి రుక్మిణమ్మ తర్వాత రాయలసీమలో కథారచన చేపట్టిన కథారచయిత్రి పూండి చెల్లమ్మ. ఈమె కడప జిల్లా ప్రొద్దుటూరు నివాసి. ఈమె 1927 ఆగష్టు 'భారత కథానిధి' సంచికలో 'సీతాబాయి' అనే కథ రాసింది.

స్వయంకృషితో స్త్రీ సాధించలేని పని ఏదీ లేదని తెలియజేసే కథ ఇది. కథలో సీతాబాయి, రామస్వామి భార్యాభర్తలు. వీరికి పెళ్ళీడుకొచ్చిన కూతురు ఉంది. రామస్వామి కలెక్టరు ఆఫీస్‌లో గుమస్తాగా పని చేస్తున్నప్పటికీ వరకట్నం వేధింపులున్న సమాజంలో తన కూతురికి పెళ్ళి చేయడానికి ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటుంటాడు. ఈ విషయం తన భార్యకు చెప్పి బాధపడ్తాడు. సీతాబాయి తన కూతురు పెళ్ళికి కావలసిన ఆర్థిక సంపాదన చేయాలనుకుంటుంది. సీతాబాయి చదువుకున్న ఇల్లాలు. తన పుట్టింట కొంత వైద్యం నేర్చుకొని ఉంటుంది. తాను నేర్చుకున్న వైద్యంతో తన చుట్టూ ఉన్నవారికి జబ్బులను నయం చేస్తూ ధనం కూడ పెడ్తుంది. ఒకసారి భర్త పనిచేస్తున్న కలెక్టరు గారి కూతురికి నయంకాని జబ్బును కూడా సీతాబాయి తన వైద్యంతో నయం చేస్తుంది. అందుకు ప్రతిఫలంగా ఆ కలెక్టరు 2000 రూపాయలు ఇస్తాడు. ఇలా తాను వైద్యం చేసి డబ్బు కూడపెట్టి తన కూతురికి పెళ్ళి చేస్తారు సీతాబాయి దంపతులు.

కుటుంబంలో స్త్రీ చదువుకోవాల్సిన అవసరాన్ని ఈ కథ తెలియజేస్తుంది. భర్తతోపాటు భార్య కూడా కుటుంబాన్ని బాధ్యతగా స్వీకరిస్తే కలిగే ప్రయోజనాన్ని ప్రతిబింబిస్తుంది

కథ. భార్యను కేవలం వంట ఇంటి కుందేలుగా కాక సమాజ నిర్మాణంలో సగభాగస్తురాలుగా భర్త భావించవలసిన తీరును వెళ్ళడిస్తుంది. 1927 ప్రాంతంలో ఆర్థిక స్వేచ్ఛలేని ఇల్లాలు తాను సంపాదించి తన కూతురి పెళ్ళి చేసేంత ఆర్థిక సమీకరణ చేయడం స్త్రీ పట్టుదలకు నిదర్శనం. స్త్రీ పరిశ్రమ వెనుక దాగి ఉన్న కార్యదీక్షను ఒక రచయిత్రి రాయడం మరింత ఆదర్శం.

> ***రాయలసీమ నుండి వచ్చిన తొలితరం కథలలో 1914కి ముందు రచయిత్రులు రాసిన కథలు ప్రధానంగా స్త్రీ కేంద్రీకృతాలే.***

'అలవేలమ్మ'. ఈమె 1927 డిసెంబర్ 'భారత కథానిధి' సంచికలో 'బారాకట్ట' కథ రాసింది. కథలో సుందరమ్మా, కమలమ్మా ఇరుగు పొరుగువారు. తన ఇంటి పనులను తొందరగా ముగించుకున్న సుందరమ్మ ఉబుసుపోక కోసం బారాకట్ట ఆడదాం రమ్మని కమలమ్మను పిలుస్తుంది. కానీ కమలమ్మ బారాకట్ట జూదము వంటిదని ఆడవద్దంటుంది. అటువంటి ఆటలు ఆడేదాని కంటే సమయం వృథా చేయకుండా ఏవైనా పుస్తకాలు చదివి విజ్ఞానం సంపాదించమంటుంది. ఈ మాటలతో జ్ఞానోదయం పొందిన సుందరమ్మ బారాకట్ట ఆడదు. కథ చిన్నదే అయినప్పటికీ స్త్రీలు చదువుకుకోవాల్సిన అవసరాన్ని తెలియజేస్తుంది.

కడప జిల్లా వల్లూరుకు చెందిన మరో రచయిత్రి డి. పాపమ్మ. ఈమె 1929 నవంబర్ 'భారత కథానిధి' మాసపత్రికలో 'అత్తగారేదియో తెలిసికొంటిరా?' అనే కథ రాసింది. ఈ కథలో చలపతి భార్యపై అనుమానంతో భార్యను ఇంటి నుండి వెళ్ళగొడతాడు. అయితే అప్పటికే చలపతి దంపతులకు ఒక కూతురు జన్మించి ఉంటుంది. చలపతి కూతుర్ని తన వద్దనే ఉంచుకుని భార్యను ఇంటి నుండి వెళ్ళగొడతాడు. చలపతి భార్య చదువుకున్న ఇల్లాలు.

భర్త నిరాదరణకు గురైన చలపతి భార్య ఒక బాలికల పాఠశాలను స్థాపిస్తుంది. తాను బ్రతకడంతోపాటు మరికొందరికి ఉపాధి కల్పిస్తుంది. ఎంతోమందికి విద్యనేర్పుతుంది. కొంతకాలానికి చలపతి తన కూతురికి పెళ్ళి చేస్తాడు. అల్లుడు ఉద్యోగ ప్రయత్నం చేస్తుంటాడు. ఆ విషయం తెలిసిన చలపతి భార్య తన అల్లుడికి బడిలో ఉద్యోగం ఇస్తుంది. అయితే ఆమె తన అత్త అనే సంగతి చలపతికి తెలియదు. తర్వాత తన భార్య ద్వారా ఆమె తన అత్త అని తెలుసుకుంటాడు.

ఈ కథ స్త్రీ పట్టుదలకు, గుండె ధైర్యానికి నిదర్శనం. భర్త నిరాదరించినప్పటికీ ఏమాత్రం కృంగిపోకుండా బ్రతుకు పోరాటాన్ని సాగిస్తుంది. చలపతి భార్య ఎక్కడా తిరుగుబాటు చేసినట్లు కనిపించదు. కానీ స్వయం కృషితో పాఠశాలను స్థాపించి అందునా ప్రత్యేకంగా బాలికల పాఠశాలను స్థాపించి బాలికలకు విద్యనేర్పడం అపూర్వం. తన లాగా భవిష్యత్తులో మరో ఏ ఆడబిడ్డ బ్రతుకు వీధిపాలు కాకూడదనీ ఒకవేళ అలా జరిగినా స్త్రీలు ఆత్మస్థైర్యంతో బ్రతకడం కోసం విద్య అవసరం అనే ఉన్నతమైన ఆలోచన చలపతి భార్యది.

రాయలసీమ నుండి వచ్చిన తొలితరం కథలలో 1914కి ముందు రచయిత్రులు రాసిన కథలు ప్రధానంగా స్త్రీ కేంద్రీకృతాలే. 1927-29 మధ్య వచ్చిన ఈ కథలలో మామిడి రుక్మిణమ్మ రాసిన 'సుందరి' కథ భూస్వామ్య భావజాలాన్ని ధిక్కరించే కథ. పూండి చెల్లమ్మ రాసిన 'సీతాబాయి' కథ స్త్రీ ఆర్థిక ప్రగతిని తెలియజేసే కథ. అలవేలమ్మ రాసిన 'బారాకట్ట' కథ స్త్రీకి చదువు అవసరాన్ని గుర్తు చేసే కథ. డి. పాపమ్మ రాసిన 'అత్తగారేదియో తెలిసికొంటిరా?' కథ స్త్రీ పట్టుదలను, ఆత్మస్థైర్యాన్ని ప్రతిబింబించిన కథ.

రాయలసీమ కథాసాహిత్యంలో 1940కి ముందున్న 40 మంది కథకులలో నలుగురు కథా రచయిత్రలున్న సంగతి తెలుసుకున్నాం. వారిలో 'మామిడి రుక్మిణమ్మ' చిత్తూరు జిల్లా తొలి కథకురాలే గాక రాయలసీమ తొలికథా రచయిత్రి కూడా. పూండి చెల్లమ్మ కడప జిల్లా తొలికథా రచయిత్రి. అలవేలమ్మ కర్నూలు జిల్లా తొలికథా రచయిత్రి. మిగిలిన ఏ ఇతర తెలుగు ప్రాంతాలకు తీసిపోని విధంగా రాయలసీమ కథారచయిత్రులు కలం పట్టడం చాలా గొప్ప అభ్యుదయం. స్త్రీ అభివృద్ధి చెందితేనే కుటుంబం, సమాజం అభివృద్ధి చెందుతుంది. ఈ విషయాన్ని సీమ తొలి కథారచయిత్రులు నియమంగా పాటించడంవల్లే వారి నుండి ఇంత గొప్ప కథా సాహిత్యం వెలువడింది.

# తనను తెలుసుకోవడమే శిల్పం

- డాక్టర్ కత్తి పద్మారావు
9849741695

కొన్ని కళ్ళు సూర్య గోళాలు
కొన్ని కనురెప్పలు కావ్యాలు రాస్తాయి
అక్కడ అక్షరాలు అమృత బిందువులుగా వర్షిస్తాయి
సంవత్సరాలు గడుస్తున్న కొలది
కొన్ని శిల్పాలు ప్రకాశవంతం అవుతాయి
తమను తాము చెక్కుకొనే
ఉలులు వారి మునివేళ్ళలో ఉన్నాయి
అవును! వారికి ప్రేమించటమే తెలుసు
ద్వేషించటం రాదు
లోయల్లో నుండి ఉదయించే సూర్యుడికి
వాళ్ళు దివిటీలు పడతారు
వారికి కల్మషం లేదు
విశాలమైన కడలి అలలోను
మధుర సంగీతం వినిపిస్తారు
అవును! వారు వెన్నెలతో కడగబడ్డారు
పాలరాతి విగ్రహంలా భాసిస్తారు
వారి కనులతోనే మాట్లాడతారు
అందులో ఆత్మీయ భాష ఉంది
గుండెల్ని కదిలించే కుదుపు ఉంది
మనస్సులోని ప్రతిపొరపై
సంతకం చేయగల సాధికారత వారిది
వారి గొంతుకులోని స్వరాలకు
మనుషులను సజీవం చేసే శక్తి ఉంది
వారు దోసిళ్ళు బట్టి తలమీద పూలు జల్లుతారు
తేనే బిందువులు నాలుకకు అందిస్తారు
చెవిలో నదీ తరంగాల సవ్వడి వినిపిస్తారు
శిశువులకు ఆయువులు పోయడం వారికి ఓ దినచర్య
అవును! ప్రేమ ఒక జిజ్ఞాస
ప్రేమ ఒక విజ్ఞత
ప్రేమ ఒక జీవన సౌరభం
ప్రేమ ఒక రాగమాలిక
ప్రేమ మనో సౌందర్యం
నిజమే! ప్రకృతిని ఒడిసిపట్టలేని వారు
పెదాలతో జీవిస్తారు
పగలే వారు కునుకుతారు
సంభాషణలో వ్యతిరిక్తులవుతారు



ఒంటరితనం ఎప్పుడూ ఒక శాపమే
తోడే మనిషికి జీవం
పక్షి గువ్వలన్నీ జంటగానే వున్నాయి
వాటికి సృజనం ఉంది, సౌజన్యం ఉంది,
సమున్నతి ఉంది, గెలుపు ఉంది
మనుషులు అభివ్యక్తి శూన్యులవుతున్నారు
భయం వారిని పాలిస్తుంది
భయం వారి నడకను కుంటు పరుస్తుంది
భయం వారి అభ్యున్నతికి గొడ్డలి వేటు
వారు దేన్ని నిరాకరిస్తున్నారు, దేన్ని స్వీకరిస్తున్నారు
మనుషులు తోడుతోనే పల్లవిస్తారు
ప్రజ్వలిస్తారు కూడా
సంభాషణ ఓ వివేచన
వారికి ఏమి తెలుసనుకుంటారో!
అది వారికి పూర్తిగా తెలియదు
అర్ధ మనస్కులు, వారు చాలా విషయాలు స్వీకరించరు
అవే వారికి ఎదురు నిలబడతాయి
అనుబంధం అంటే ఏమిటి?
ఆహారం ఇవ్వడం ఒక్కటే కాదు కదా!
మనస్సును ఇవ్వగలగాలి
అదే అన్ని భావోద్వేగాలను స్వీకరిస్తుంది
తమలోకి తాము చూసుకోవడమంటే ఏమిటి?
తమలోని వెన్నెలను, చీకటిని చూడగలగడమే?
ఎవరైనా తమనితాము
శిశువులుగా ఆవిష్కరించుకోవాల్సిందే!
తోడుకు ఊపిరి పోయాల్సిందే!
గుండెలను వెలిగించే ఔదార్యం కావాల్సిందే
నిజమే! ఆ భాషణలోనే సజీవత ఉంది
తన్ను తాను తెలుసుకునే భావన ఉంది
తనను తాను శిల్పించుకునే నేర్పు ఉంది
తనను తాను తెలుసుకోవడమే విజయానికి సోపానం ♦



# తూర్పు పడమరల సాహిత్య కలబోత

- రామతీర్థ
98492 00385

అరవై రెండేళ్ల కజువా ఇషిగురోకి 2017 సాహిత్య నోబెల్ వచ్చిన సందర్భంగా స్వీడిష్ అకాడెమీ పెర్మనెంట్ సెక్రటరీ సారా డేనియస్, 'గొప్ప నిజాయితీ గల రచయిత, పక్కలకు చూడకుండా తనకంటూ ఒక కళాత్మక ప్రపంచాన్ని ఏర్పాటు చేసుకున్న సాహిత్యవేత్త'గా అభివర్ణించారు. ఇంకా 'కొంత జేన్ ఆస్టెన్‌ను, కొంత ఫ్రాంజ్ కాఫ్కాను కలిపితే, కొద్దిగా మార్సెల్ ప్రౌస్ట్‌ను చేరిస్తే, అప్పుడు మీకు ఇషిగురో క్లుప్తరూపంలో అందుతాడు. అప్పుడు మీరు వారి శైలుల్ని పైపైనే కలపాలి. అలా తన రచనలు రూపొందుతాయి' అంది.

అణుబాంబు దాడికి గురైన నాగసాకిలో 1954లో పుట్టిన ఇషిగురో... తండ్రి ఉద్యోగరీత్యా ఇంగ్లాండ్‌కు వచ్చి, అక్కడే చదువుకుని స్థిరపడ్డ, బ్రిటిష్ పౌరుడు. ఇంగ్లాండ్‌లో తానొక రచయితను అని 1980ల్లో ఆయన చెప్పుకుంటే, జపాన్ భాషలో రాసే రచయిత అనుకునేవారు ప్రజలు. కానీ ఇషిగురో ఇంగ్లీష్‌లో రాస్తాడు. అక్కడి కెంట్‌లో, తదుపరి ఈస్ట్ ఆంగ్లియా విశ్వవిద్యాలయంలో కళా, మానవ వికాస రంగాల్లో ఎం.ఎ పొందాడు. అక్కడ లిటరరీ ప్రాజెక్టుగా కొన్ని కథలు తొలుత రాశాడు. ఈ కథల్లో ఆయన జీవితంపై గల తూర్పు, పడమర సంస్కృతుల ప్రభావం కనిపిస్తుంది. 'వెయిటింగ్ ఫర్ జె', 'విలేజ్ ఆఫ్టర్ డార్క్' వంటి అయిదు కథల సంపుటులు ఆ రోజుల్లో వెలువరించినప్పుడు ఆంగ్ల సాహిత్య సమాజం ఇదొక కొత్త స్వరంగా గుర్తించింది. ముప్పై ఐదేళ్ళ సాహిత్య ప్రయాణానికి ఇషిగురోకు సాహిత్య నోబెల్ త్వరగానే వచ్చిందని చెప్పాలి.

తనకి ఐదేళ్లప్పుడు, 1959లో ఇంగ్లాండ్‌లోని సర్రేలో, తండ్రి మెరైనోగ్రఫీ శాఖలో ఉద్యోగిగా అక్కడ నివసిస్తూ, ఇంగ్లీష్ గ్రామర్ స్కూల్లో ఇంగ్లిషు నేర్వడం పిల్లవాడైన ఇషిగురోకి తొలి ఆంగ్ల అనుభవం. 'నాకు ఐదేళ్లప్పుడు ఇంగ్లాండ్ వచ్చాను. మా అమ్మ, నాన్న ఇద్దరికీ ఇంగ్లీష్ బాగా రాదు. మా అమ్మయితే అసలు ఇంగ్లీష్ మాట్లాడేది కాదు. ఇంగ్లిషు ఎలా నేర్చుకున్నానంటే స్కూల్లో పాఠాలు అయిపోయాక ఇంటికొచ్చాక... టీవీలో తెగ వచ్చే వెస్టర్న్ సినిమాలు బోన్జా, వేగన్ ట్రైన్ వంటివి చూసే. అవి చూస్తూ, రకరకాల పలుకుబడులుగా ఇంగ్లీష్ ఎలా మాట్లాడతారో గమనించాను. ఇక్కడ ఇంగ్లాండ్‌లో, అక్కడ అమెరికాలో, పల్లెల్లో... ఇవన్నీ ఎలా పలుకుతారో కొంత ఆసక్తిగా మనసులో పెట్టుకున్నాను. అయినా చాలా గందరగోళంగా ఉండేది. స్కూల్లో అందరూ నా ఇంగ్లిషును విడ్డూరంగా వినేవారు. పెద్ద గుర్రం మీద వచ్చే అర్థరియన్ కౌబాయిలా ఒక ఎత్తైన మనిషి, ఎత్తయిన గుర్రం పైన... ఆ దృశ్యం ఇది నా పసి మనసులో ఒక బలమైన ముద్ర. వీటిని చూసినప్పుడు నాకు చిన్నప్పుడు జపాన్‌లో విన్న సమురాయి యోధుల కథలు గుర్తుకు వచ్చేవి.'

.. ఇలా చెప్పుకున్న కజువో ఇషిగురో, తన తొలి కథల ప్రయత్నానికే, ఇరవై తొమ్మిదేళ్ల వయసులో 1983లో ప్రతిభావంతులైన ఇంగ్లీష్ యువ రచయితల జాబితాలో, గ్రాంటా ప్రచురణ సంస్థ మార్టిన్ ఏమిస్, అయాన్ మెక్ ఇవాన్, సల్మాన్ రష్దీ, వంటి వారితో, ఇషిగురో పేరు కూడా చేర్చి ఇతని ప్రతిభనూ, మున్ముందు ఇంకా రాణించబోతున్న అంచనానూ ప్రకటించింది. తాను పౌరుడిగా జీవిస్తున్న బ్రిటిష్ దేశంలో ఒక బట్లర్ పాత్రను సష్టించి, ఇషిగురో తన 32వ ఏట చెప్పిన కథ 'రిమైన్స్ ఆఫ్ ద డే' బుకర్ బహుమతి పొందింది. ఈ నవలను ఆయన ఏకబిగిన నాలుగు వారాల్లో రాశాడు.

తొలి నవల 'పేల్ వ్యూ ఆఫ్ హిల్స్'లో ఒక వృద్ధ జపనీస్ మహిళ గురించి, 'యాన్ ఆర్టిస్ట్ ఆఫ్ ది ఫ్లోటింగ్ వరల్డ్'లో ఒక నడి వయసు పెయింటర్ గురించి, రాసిన ఇషిగురో, తన మూడో నవలకు ఇంగ్లండ్ దేశంలో ఒక బట్లర్‌పై రాసిన దానికి బుకర్ అవార్డు పొందాడు. బుకర్ బహుమాన తీరు గురించి, 'ఈ బహుమతి ఈ రకమైన రచనలకు ఎలా ఇస్తారో స్పష్టం కాదు. ఒక గుర్తింపు దిశగా ఈ బహుమతి ఉపకరిస్తుంది అనుకోను' అని తన అభిప్రాయం ప్రకటించాడు. తన మొదటి నవల 'ఏ పేల్ వ్యూ ఆఫ్ హిల్స్'లో ఒక జపనీస్ మహిళ ఆంగ్ల వ్యక్తిని పెళ్లి చేసుకుంటుంది. తన కూతురి ఆత్మహత్యకు తానే కారణమనే అపరాధ భావన ఆమెను వేధిస్తూ ఉంటుంది. ఈ ఆత్మహత్య ఆమెకు నాగసాకిలో తాను కలిసిన ఒక మహిళ, ఆమెకు పుట్టిన అణు ధార్మికత సోకిన బిడ్డ, ఆ ప్రజల్లో నేటికీ బాంబుదాడి విష రసాయనాల పట్ల గల భయం, యుద్ధంలో జపాన్ లొంగుబాటు... ఇవన్నీ కథలో కలిసిపోయి కనిపిస్తాయి.

**తను చిన్ననాడే వదిలి వచ్చిన జపాన్ దేశం గురించి సహజశీలంగా రాయగలుగుతున్న ఆయన రచనాశక్తిని విమర్శకులు ప్రశంసించారు.**

రెండో నవల 'యాన్ ఆర్టిస్ట్ ఆఫ్ ద ఫ్లోటింగ్ వరల్డ్'లో ఒక జపనీస్ కళాకారుడు, తను విని ప్రభావితుడైన జపాన్ సైనిక ప్రచారం, చివరికి ఆ ప్రాపగాండా వైఫల్యం, తను గురయ్యే ఆందోళన, వేగంగా మారిపోతున్న సమాజ విలువల తీరును చిత్రీకరిస్తాడు ఇషిగురో. తను చిన్ననాడే వదిలి వచ్చిన జపాన్ దేశం గురించి సహజశీలంగా రాయగలుగుతున్న ఆయన రచనాశక్తిని విమర్శకులు ప్రశంసించారు. మూడవ నవల 'ద రిమైన్స్ ఆఫ్ ద డే'లో స్టీవెన్స్ అనే ఒక బట్లర్ 1956లో తాను ఒక దొరతో కలిసి చేసిన ప్రయాణ వివరాలూ, చేదు నిజాలు, మనుషుల మధ్య సంబంధాలు, కర్తవ్యం, గౌరవ పరిరక్షణ పేరిట తాను కప్పి ఉంచాడో వివరిస్తూ, అటు జపాన్, ఇటు బ్రిటన్ వీటి సంస్కృతుల జమిలి ప్రభావాలు నవలలో చెప్పుకోదగ్గ ఆకర్షణగా ఈ నవల మలిచాడు. ఇది పరిశీలకులను విస్మయపరచగా, బుకర్ గౌరవాన్ని తెచ్చిపెట్టింది 1989లో. తన రచనలకు అపరాధ పరిశోధన, సైన్స్ ఫిక్షన్, చారిత్రక కాల ఇతివృత్తాలుగా 'అన్‌కన్సోల్డ్', 'వెన్ వీ వెర్ ఆర్ఫాన్స్', 'ద బురీడ్ జెయింట్', 'నెవర్ లెట్ మి గో' ఇలా ఆరు నవలలు రాశాడు ఇషిగురో. కథలు, స్క్రీన్-ప్లేలు, పాటలూ కూడా రాశాడు.

పాశ్చాత్య సాహిత్య రంగం ఇషిగురో రచనా విధానం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపిస్తోంది. వేర్వేరు సందర్భాల్లో ఆయనతో జరిపిన సాహిత్య సంభాషణలు కూడా 'కాన్వర్షేషన్స్ విత్ కజువో ఇషిగురో' పేరిట ఒక సంకలనం కూడా వచ్చింది. సాహిత్య సంభాషణలను అచ్చు వేశారంటే... ఆంగ్ల సాహిత్య లోకం ఆయనకు ఇస్తున్న ప్రాధాన్యం అర్థమవుతోంది. ఇషిగురో నవలలకు ప్రాంత ప్రత్యేకతలు, మాండలికాలూ ఉండాలనే పట్టింపు కానీ, లక్ష్యం కానీ లేవు. భాషలో ఒక మాట వొడుపు, మాటలను కొత్తగా వాడడం వంటివి, రచనకు అంతగా అవసరం లేదని భావించాడు. పైపెచ్చు అటువంటివి అనువాదంలో కష్టాలు కలిగిస్తాయని అంటాడు. అంతర్జాతీయ నవల రాయడం తన అభిమతమని స్పష్టంగా ప్రకటించాడు. అందుకే ఇషిగురో రచనల్లో దేశ కాల నిర్దిష్టతలు ఉండవు. కథ ఎక్కడ జరిగి ఉండవచ్చో అనేది పాఠకుల ఊహకే వదిలేస్తాడు. జపాన్, బ్రిటన్ రెండు దేశాల్లో తన సాహిత్య, సాంఘిక అస్తిత్వం ఏర్పడ్డ కారణంగా, రాబోయే శతాబ్దాల నవల అంతర్జాతీయ నవల కావాలి, అదే సాహిత్య పురోగతి అని విశ్వసిస్తాడు. ఒక ప్రసిద్ధ ఇంటర్వ్యూలో ఇషిగురో మాటలివి :

'అంతర్జాతీయ నవలలు రాయాలనుకునే రచయితను నేను. అయితే అంతర్జాతీయ నవల అంటే ఏమిటి? ప్రపంచంలోని భిన్న ప్రదేశాల మానవుల నేపథ్యాలను ఒక విశాల లోక దృష్టితో రాయగలగడం. అందులో ఖండాంతరాలకు విమానాల్లో వేగవంత ప్రయాణాలు చేసే పాత్రలుండవచ్చు. అయితే అంత సులభంగానూ, అవి ఒక ప్రాంతానికి చెందినవిగా కథా చిత్రణలో ఒదిగిపోగలగాలి.

ఇలా అంతర్జాతీయంగా రాయాలి అన్న తలపు, ప్రణాళిక గల రచయితలకు అనేక క్లిష్టతలు ఉంటాయి. పాఠకుడి పరిజ్ఞానం పట్ల, రచయిత తెలివి తక్కువగా నిర్ధారణలకు రారాదు. కేవలం వాళ్ళు వేసుకున్న దుస్తుల బ్రాండ్ పేర్లు చెప్పడమో, వారు వాడే వస్తుజాలం ఏఏ భిన్న ప్రదేశాల్లో తయారైందో చెప్పేస్తే, అది అంతర్జాతీయ నవలగా మారదు. ఇలా రాయడం అతి తక్కువ మందికి నచ్చవచ్చు కానీ, భావి తరాల పాఠకులు దీని వలన పెద్దగా ప్రభావితం కారు. అలాగే మాటలతో ఆటలు, మాట విరుపు, ఒక నిర్దిష్ట పదజాలం

# జార్జ్ సాండర్స్‌కు బుకర్ ప్రైజ్







బ్రిటన్‌కు చెందిన ప్రతిష్ఠాత్మక మాన్‌బుకర్ ప్రైజ్‌ను అమెరికా రచయిత జార్జ్ సాండర్స్ గెలుచుకున్నారు. సాండర్స్ రచించిన 'లింకన్ ఇన్ ది బార్డో' నవలకు బుకర్ ప్రైజ్ లభించింది. ఈ ప్రైజ్‌ను గెలుచుకున్న అమెరికన్ రచయితలలో సాండర్స్ రెండోవారు. అమెరికా మాజీ అధ్యక్షుడు అబ్రహం లింకన్ కుమారుడు పదకొండేళ్ళ విల్లీ మరణానికి సంబంధించి సాండర్స్ రచించిన 'లింకన్ ఇన్ ది బార్డో' నవల అత్యంత వాస్తవికంగా ఉందని బుకర్ ప్రైజ్ న్యాయనిర్ణేతల కమిటీ పేర్కొంది. విల్లీ మరణానికి సంబంధించి వందలాది మంది నుంచి సేకరించిన సమాచారాన్ని నవలగా మలిచిన తీరు ప్రశంసనీయమని న్యాయ నిర్ణేతల కమిటీ వెల్లడించింది. ఈ సందర్భంగా రచయిత సాండర్స్ (58) మాట్లాడుతూ ఇది తనకు దక్కిన గౌరవంగా పేర్కొన్నారు. ఈ పురస్కారం గెలుచుకోవడానికి మొత్తం 144 నవలలు వచ్చాయి. వీటి నుండి తుది జాబితాను ఎంపిక చేసి ఆ జాబితాలోంచి జార్జ్ సాండర్స్ నవల బహుమతి పొందినట్లుప్రకటించారు. జార్జ్ సాండర్స్ అమెరికాలోని టెక్సాస్‌లో ఫైన్ ఆర్ట్స్ కళాశాలలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. నవలలు, కథా సంకలనాల వంటి రచనలు తొమ్మిది వరకు చేశారు. ఈ ఏడాది మాన్ బుకర్ ప్రైజ్‌కు ముగ్గురు అమెరికా రచయితలు, ముగ్గురు బ్రిటన్ రచయితలు పోటీపడ్డారు. మొత్తం ఆరుగురిలో జార్జ్ సాండర్స్ అవార్డు గెలుచుకున్నారు. కామన్వెల్త్ దేశాల రచయితలను ప్రోత్సహించేందుకు 1969లో ఈ అవార్డును స్థాపించారు. ఆ తరువాత 2014 సంవత్సరంలో ఇంగ్లీషు మాట్లాడే దేశాల రచయితలను కూడా అవార్డు దరఖాస్తు చేసుకునేందుకు అర్హులుగా పేర్కొన్నారు. గతంలో అమెరికన్ రచయిత పాల్ బీటి 'ది సెల్లవుట్' నవలకు ఈ అవారు లభించింది. బుకర్ ప్రైజ్ గెలుచుకున్న రచయితల పుస్తకాలకు ప్రపంచవ్యాప్తంగా సాహిత్య పాఠకుల నుండి మంచి ఆదరణ లభిస్తుంది. ◆

---

వాడుక వంటి భాషకు సంబంధించిన తెలివి తేటల ప్రదర్శన వలన కూడా రచనా ప్రయోజనం కష్టమే, అంతేకాక అవి అనువాదంలో లొంగకుండా పోయే ప్రమాదమూ ఉన్నది. (నా ఉద్దేశంలో ఏ రచయిత అయితే ప్రపంచంలో తన ఒక్క భాష మాత్రమే ఉన్నది అనుకుంటాడో.. తాను అతి తక్కువ పాఠకులకు పరిమితం అయిపోవడానికి పూర్తిగా అర్హుడు.) ఏవి ప్రపంచ మానవులకు అందరికీ పట్టే విషయాలో, వాటిని గుర్తించగలగడం, ఇలా రాయాలి అనుకునే రచయితలకు చాలా అవసరం.

ప్రపంచం మొత్తం ఎప్పటికన్నా ఎక్కువగా అంతర్జాతీయం అవుతున్నది. రాజకీయాలు, వాణిజ్యం, సామాజిక మార్పుల తీరుతెన్నులూ, లేదా కళలూ, వీటి గురించిన చర్చలు, అంతర్జాతీయ ప్రాతిపదిక పైన కాక, ఇంకో సంకుచిత పరిధిలో మాట్లాడుకునే దశ మనం దాటిపోయి చాలా కాలం అయింది. నవల కనుక ఒక ముఖ్య రచనా ప్రక్రియగా వచ్చే శతాబ్దంలోకి బతికి ప్రయాణించాలి అనుకుంటే, అందుకు అనుగుణంగా రచయితలు, అందరూ అవును అనుకునే ఒక అంతర్జాతీయ నవల రూపాన్ని సృష్టి చేస్తేనే సాధ్యం. ఇటువంటి నవల సృష్టి నా ఆశయం."

కజువో ఇషిగురో నవలల్లో ఈ ఆశయసిద్ధి ఏ మేరకు సాధ్యపడ్డది అన్న చర్చ ఉన్నా తూర్పు-పడమర మానవ జీవనాల, చరిత్రల, సాహిత్య దార్శనికత తో.. ఈ ఆధునిక ఇంగ్లాండ్ దేశ, ఆసియా జాతి పౌర రచయిత సాధించిన మానవ జీవన చిత్రణ ప్రగతి.. కథ చెప్పడంలో గల ఒక పురాతనమైన మెలకువ, ప్రజ్ఞ ఇతని సృజన వేదికను.. ఖండాల విశాలత్వంతో మానవాళికి అందించినందుకు, గుర్తింపుగా అందిన నోబెల్... రాజకీయాలకు, వివాద కీర్తివంతులకు కాక, సాహిత్య నిష్ఠగల పూర్ణ ప్రతిభకు కట్టిన పట్టంగా గౌరవించి, అభినందించడానికి పూర్తిగా యోగ్యుడు, అర్హుడు, కజువో ఇషిగురో. ◆

# గుణం - ధర్మం

- జంధ్యాల రఘుబాబు
9849753298

నీ ధర్మాన్ని నీవు పాటించమని
చిన్నప్పట్నుండే బోధిస్తున్నారు
నాకంటూ కొన్ని నియమాలు పెట్టి
గిరిగీసి అందులో బతకమన్నారు
అంతేనా
గుణంలేనిదైనా నీకదే మిన్నయని
మెల్లగా నా మనసులో
న్యూనతని నూరిపోశారు

ఓ బెరుకు విత్తనం
నాకు తెలీకుండానే నాటారు
ఓ పిరికి ఆలోచన
అతి సహజంగా చేయించారు

నీటిలో తేలిపోయే గడ్డిపోచనని
గాలికి ఎగిరిపోయే ఎండిన ఆకునని
గేదెలు తినకుండా వదిలేసిన దంటునని
ఊరికి దూరంగా ఉన్న గుడిసెల్ని
నాకు చూపించారు
నా జీవితానికి సార్ధకత
అలా జీవించటమేనన్నారు
అంతకు మించిన అర్హత
నాకు లేదన్నారు



నుదిటిరాతను నీవు నేను
ఎలా మార్చగలమని
నాకెదురు ప్రశ్న వేశారు

అన్నీ గమనిస్తున్న నాకు
అంతా అర్థమవుతున్న నాకు
మనో ఫలకంపై
చురుకైన దృశ్యాలే కనిపిస్తున్నాయి
దానిపై మలినాల్ని తుడిపేసి
గారపట్టిన వ్యవస్థకిమల్లే
జిడ్డోడుతున్న భావాల్ని కడిగి
కసిగా శుభ్రం చేసి
నా ప్రతిబింబాన్ని చూసుకున్నాను
వర్షం తరువాత కనిపించే
స్వచ్ఛమైన నీలాకాశం వలె
ప్రాత:కాలం ఇంటిముందు
ముచ్చటగా వేసిన ముగ్గువలె
జీవిత సత్యాన్నెరిగిన
వాల్మీకి నిశ్చలమైన మనస్సువలె
వేనవేల పదాలను
మృదువుగా చెప్పిన
వేమన పద్యంవలె
జాషువాకు సగర్వంగా
తొడిగిన గండపెండేరంవలె
ఎంతో అందంగా కనిపిస్తోంది

నేనిప్పుడు
శ్రీశ్రీ చూపిన మరో ప్రపంచాన్ని
తిలక్ కురిపించిన అమృతాన్ని
సినారె వినిపించిన విశ్వంభరను

ఇప్పుడు తెలిసింది
నా గుణానికి ధర్మముందని
నా ధర్మానికి గుణముందని ◆

---

# నానీలు

- కొలూరి ప్రసాదరావు
7382907677

'సో'దె'ను నమ్మను
ఐనా చెప్పించుకున్నా!
ఆమె కళ్ళలో
ఆకలి బాధ చూసి!!

నచ్చే తిండీబట్టా
ఇచ్చే తల్లీదండ్రీ
మెచ్చే నెచ్చెలిని చూడరా?
ప్రేమంటావు!

పుస్తకం
హస్తభూషణం ఒకనాడు!
సెల్యులర్
సర్వభాషణం ఈనాడు!!

ప్రేయసికి
కొండమీది కోతినిస్తావా?
సర్లే! ముందు
తల్లికి గుడిసె చూడు!!

కవి ఇంట్లో చోరీ
నాల్గు తులాల కవిత
ఐదు సవర్ల కథా
పోయాయి!

ఎవ్వరూ లేరు
అయినా అనాధ కాదు
ధైర్యం
తోడుగా ఉందిలే!



చావు రాకుండా
అమృతమియ్యి దేవుడా!
కరుణించాడు
కవిత్వమిచ్చాడు!! ◆

# జి.ఎన్.రెడ్డి పీఠికలు సాహిత్య సుగంధ వాటికలు

- కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి
9948774243




ఇందులో మొత్తం *61* పీఠికలున్నాయి. ఈ పీఠికలను అచ్చు వేయడానికి సంకల్పించిన విద్యార్థులు వారి చదువు పూర్తి అయిన *4* ఏళ్ళకు ముందుకు రావడం చాలా గొప్ప విషయం. జి.యన్.రెడ్డి ప్రతిపీఠిక ఆ గ్రంథానికి అమూల్యాభరణంగా భావించవచ్చును. *1978*లో జి.ఎన్.రెడ్డి "తెలుగు విమర్శ వాఙ్మయంతో పీఠికా సాహిత్యానికి ఇంతవరకు గుర్తింపు లేదు. నిజానికి సాహిత్య విమర్శలో ఒక శాఖగా గుర్తించవలసిన రచనా వ్యాసంగం ఇది" అన్న మాటలు ఎంతో దూరదృష్టితో అన్నవిగా ఈనాడు భావించబడుతున్నాయి.

ఇటీవల రాచపాళెం చంద్రశేఖర రెడ్డి సంపాదకత్వంలో ప్రచురించబడిన "ఆచార్య జి.ఎన్.రెడ్డి పీఠికలు" అనే పుస్తకం చదివాను. ఈ పుస్తకం ప్రచురణే ఎంతో ఆదర్శవంతంగా, అభినందనీయంగా జరిగింది. ఎందుచేతనంటే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం 1970-72 ఎం.ఎ తెలుగు విద్యార్థులు ఆచార్య జి.ఎన్.రెడ్డి గారి మీద ఉన్న గురుభక్తితో, వారి పీఠికారచన నైపుణ్యాన్ని వెలుగులోకి తేవాలనే ఒక దృఢసంకల్పంతో విద్యార్థిబృందం ఉమ్మడి బాధ్యతతో ఈ పుస్తకాన్ని వెలువరించారు. ప్రాచీన, ఆధునిక సాహిత్యం మీద జి.ఎన్.రెడ్డి వెలువరించిన పీఠికలను చదివినట్లయితే, వీరు ఎంత సంప్రదాయప్రియులో అంత ఆధునికత ఇష్టులుగా అర్థమౌతుంది.

'పీఠికా రచయితగా ఆచార్య జి.ఎన్.రెడ్డి అనే ముందుమాటలో, రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారు "రచనకు పీఠిక, సమీక్ష, విమర్శ, పరిశోధన అని నాలుగు అధ్యయన దశలుంటాయి. పుస్తక ప్రచురణకు పీఠిక ముందటిది. తక్కిన మూడు పుస్తక ప్రచురణ తర్వాతివి" అంటూ రాసిన సుదీర్ఘవ్యాసంలో, రాచపాళెం వీరు, పీఠిక ప్రయోజనం, తెలుగు పీఠికల సంకలనం, అధ్యయనం, జివన్ రెడ్డిగారి పీఠికారచన, పీఠికల కూర్పుాక్రమం, జి.యన్ రెడ్డి పీఠికల్లో పీఠికనిర్మాణం, సాహిత్యచర్చ, మొదలగు వానిని గూర్చి ఎంతో లోతుగా, విస్తారమైన సమాచారాన్ని అందించారు.

ఇందులో మొత్తం 61 పీఠికలున్నాయి. ఈ పీఠికలను అచ్చు వేయడానికి సంకల్పించిన విద్యార్థులు వారి చదువు పూర్తి అయిన 4 ఏళ్ళకు ముందుకు రావడం చాలా గొప్ప విషయం. జి.యన్.రెడ్డి ప్రతిపీఠిక ఆ గ్రంథానికి అమూల్యాభరణంగా భావించవచ్చును. 1978లో జి.ఎన్.రెడ్డి "తెలుగు విమర్శ వాఙ్మయంతో పీఠికా సాహిత్యానికి ఇంతవరకు గుర్తింపు లేదు. నిజానికి సాహిత్య విమర్శలో ఒక శాఖగా గుర్తించవలసిన రచనా వ్యాసంగం ఇది" అన్న మాటలు ఎంతో దూరదృష్టితో అన్నవిగా ఈనాడు భావించబడుతున్నాయి. ఆచార్య జి.ఎన్.రెడ్డి మూడవ తరం పీఠికా రచయిత అయినప్పటికీ, వీరి పీఠికలు, పీఠికా నిర్మాణం గురించి, సాహిత్యం మీద వారికి ఉన్న అభిప్రాయాలు వో చర్చను లేవనెత్తే విధంగాను ఉంటాయి. సాహిత్యాన్ని జానపద సాహిత్యము, శిష్టసాహిత్యమని చెప్పుకుంటుంటాము. కానీ వీరు

"ఆటవిక జనసాహిత్యం" అనే మూడో విభాగాన్ని తెరపైకి తెచ్చారు. ఇది వీరి నూతన సృష్టి. ప్రాచీన సాహిత్యంలాగే, ఆధునిక సాహిత్యం మీద కూడా వీరు తనవైన అభిప్రాయాలను నిక్కచ్చిగా పీఠికల్లో వ్యక్తపరిచారు. ఈయన, మనిషికి భౌతికవాదంలోని మేలును విప్పిచెప్తూనే ఆధ్యాత్మిక వాదంలోని నమ్మకాల్ని విశదపరచారు. వీరి పీఠికానిర్మాణం పద్ధతి వొక ప్రత్యేకవైఖరిని సంతరించుకొని ఉంటుంది. పీఠిక రాస్తున్న గ్రంథంలోని విషయంలోకి నేరుగా వెళ్లకుండా, గ్రంథనేపథ్యాన్ని వివరిస్తూ ఆ తర్వాత గ్రంథ రచయిత కృషిని ఎత్తిచూపుతూ, ఒక్కోసారి ఇంకా జరుగవలసిన కృషిని గుర్తుచేస్తూ, చివరకు ఆ రచయిత అనుసరించిన పద్ధతిని వివరిస్తారు. ఇది ఆయన పీఠికా నిర్మాణం లోన వున్న సూక్ష్మ పరిశీలన. అట్లే సాహిత్య చర్చగా పీఠికల్లో ఆయన కున్న అభిప్రాయాలను వెల్లడిస్తారు. ఇవి చాలా విలువైనవి. తర్వాత తరం వారు అనుసరించదగినవిగా వాటిని మనం భావించవచ్చును. కవిత్వ లక్షణాలను ప్రస్తావిస్తూ వైచిత్రి ముఖ్య లక్షణంగా పేర్కొంటారు. The poet feels what everybody feels. But says what all cannot say ఇది కవి యొక్క గొప్పతనం. కవికి సామాజిక స్పృహ ఉంటే వస్తుపరమైన దారిద్ర్యం ఉండదు అంటారు. ''మన ఆలోచనలు అభిప్రాయాలు ఆధునికమైన మనం మాట్లాడే భాష కూడా ఆధునీకరణ పొందడం తప్పదు. విశ్వవిద్యాలయ తెలుగు శాఖలు, తెలుగు పండితులు మాత్రమే భాషను ఆధునీకరిస్తారనుకోవడం ఆధునీకరించ గలరనుకోవడం పొరపాటు, భాషా స్పృహ కలిగిన వారెవరైనా తెలుగు భాషాభివృద్ధికి, ఆధునీకరణకూ దోహదం చేస్తారు" అనే భావన జి.యన్ రెడ్డి ఎన్నోచోట్ల వ్యక్తీకరించారు.

భాషా స్పృహ కలిగిన వారెవరైనా తెలుగు భాషాభివృద్ధికి, ఆధునీకరణకూ దోహదం చేస్తారు" అనే భావన జి.యన్ రెడ్డి ఎన్నోచోట్ల వ్యక్తీకరించారు.

ఆచార్య జి.యన్.రెడ్డి పీఠికల్లో వ్యక్తీకరించిన వీరివైన కొన్ని భావాలను కొన్నింటిని పరిశీలిద్దాం. మైనంపాటి వెంకట సుబ్రహ్మణ్యం రాసిన 'శ్రీకృష్ణతాండము' అనే కృతికి రాసిన పీఠికలో ''తెలుగుభాషాపదజాలం ద్విముఖమైంది. నైఘంటికమైన సంస్కృతిభాగం, లోకవ్యవహార సిద్ధములైన దేశిభాగం, పుం.స్త్రీ సమ్మిశ్రితమైన మానవప్రకృతికి ప్రతిబింబం. సంస్కృతభాగం పరుష ప్రకృతి దేశిభాగం స్త్రీ ప్రకృతికి నిర్దేశకాలు ప్రతీకలుగా భావించవచ్చు అంటారు. మన ప్రబంధసాహిత్యం 'కళాపూర్ణోదయం' అపూర్వమైనట్లు ఈనాటి సాహిత్యంలో పుటపర్తి నారాయణచార్యులు రాసిన 'శివతాండవం' ఒక అసదృశ్యమైన రచన. ఇట్టి విశిష్ట కృతిని స్మరింపజేస్తూ దానికి దృష్టాంతరంగా వెలసిన కృతి ఈ "శ్రీకృష్ణతాండవం" – ఇది శివతాండవ కావ్యాన్ని స్మరింపజేస్తుంది అంటారు.

"ఇరుగుపొరుగు భాషల్లో, లేదా భిన్న దేశాల్లో వెలసిన సాహిత్యాలను సరిపోల్చి వాటిలోని సామ్యవైషమ్యాలను, పరస్పర ప్రభావాదులను ప్రత్యేక లక్షణాలను పరిశీలించడమే ''తులనాత్మక పద్ధతి'' అంటూ నిర్వచిస్తూ "దాక్షిణాత్యసాహిత్యసమీక్ష" తులనాత్మక సాహిత్యవిమర్శకు ప్రధానమైన గ్రంథంగా పేర్కొంటూ రచయిత జి.నాగయ్యను అభినందిస్తారు జి.యన్.రెడ్డి.

తిక్కన రాసిన ఆంధ్రమహాభారతం లోని శల్యసౌప్తిక, స్త్రీ పర్వాలకు రాసిన పీఠికలో "మహాభారతం మానవ ప్రకృతిని ప్రతిబింబించే మహేతిహాసం. ప్రకృతి అంటే స్వభావం. మానవ స్వభావం బహువిధమూ, బహుముఖమూ అయినట్టిది. మానవజీవితం మునకలేస్తున్న సంఘర్షణలు మూడు విధాలుగా ఉంటాయి. మొదటిది హృదయానుభూతికి, యుక్తాయుక్త విచక్షణకు సంబంధించినదైతే, రెండోది వైయక్తికానుభూతికి సామాజిక ధర్మాధర్మాలకు మధ్య ఏర్పడే సంఘర్షణ. మొదటిది వైయక్తికం అయితే రెండోది సామాజికం. ఇక మూడవది పరిమితమైన వైయక్తిక శక్తి అలౌకికమైన దివ్యశక్తిని ఎదుర్కొన్నప్పుడు సంభవించే సంఘర్షణ. భారతంలో "కన్నబిడ్డల మీద మమకారంతో న్యాయాన్ని చూడలేని ధృతరాష్ట్రులు, తీరని అధికారదాహంతో తపించే దుర్యోధనులు, గురుస్థానంలో ఉన్నా మాత్సర్యావేశపరులై చరించే ద్రోణులు, అబలల్ని దుర్నీతితో బలాత్కరించే కీచకులు, అవమానపరచే దుశ్శాసనులు, లక్ష్యసాధనకు దయాదాక్షిణ్యాలు పాటించని శ్రీకృష్ణులు, కార్యసాధనకు అసత్యాన్ని అంటీ అంటనట్లు చెప్పగల ధర్మరాజులు, వ్యక్తిత్వాన్ని ఇతరులకు తాకట్టుపెట్టే కర్ణులు భారతంలో కనిపించినట్లే మన సమాజంలో ఎవరిలోనో ఏదో ఒక రూపంలో కనిపిస్తూనే ఉంటారు. కనుక మానవ ప్రకృతికి వైవిధ్యసహితయై

# కారుమబ్బులు

- ఇల్ల ప్రసన్నలక్ష్మి
9494165632

మలి సంజె గూటికి
మేమింకా చేరనేలేదు
రెక్కలింకా మొలవని
మా గువ్వపిల్లొకటి
ముక్కుతో రక్కుతూ
మూకుమ్మడి గుంపులోంచి
ఏకాంతవాసానికై
మబ్బులాకాశంలోకి
రివ్వున ఎగురుతానంటూ
పయనమౌతానంటోంది
మమతల హరివిల్లు విరిగినట్టు
మనసు మెలితిరుగుతోంది
చదువుల కర్మాగారపు పొగలు
పసికూనల మెదళ్ళకు ప్రాకాక
కార్పోరేటు వ్రణం
కణం... కణం...
అఖండిత అణువుగా
పరిణమించాక
అమ్మానాన్నలు అనురాగాలు
ఆత్మీయ సంబంధాలు
అరుణోదయపు
ఆఖరి ఘట్టానికి చేరినట్టే
విజయోత్సవ పట్టాభిషేకానికి
ముహూర్తం కుదిరినట్టే....



◆

సార్వకాలికమూగా దర్పణంగా ఉంటుంది మహాభారతం అంటూ వ్యక్తీకరిస్తాడు జి.యన్.రెడ్డి.

బి. భాస్కర చౌదరి' రాసిన జాషువ జీవిత కవితాప్రస్థానం పీఠికలో "ఆధునికాంధ్ర సాహిత్యరంగంలో తొలితరం కవుల్లో అన్ని విధాలా విలక్షణంగా ప్రసన్నమయ్యే మహనీయమూర్తి జాషువా అంటారు. జాషువాది రాపిడిపడ్డ జీవితం. రాపిడిలో రాణించిన ప్రతిభ, ప్రతిభతో గుభాళించిన కవిత. "కులమత విద్వేషంబున తలసూపని కళారాజ్యం" కోసరం కలలుగన్న ఆశావాది జాషువా. ఈయన జీవితం వడ్డించిన విస్తరికాదు. తద్భిన్నం. విస్తరికోసం వడ్డన కోసం వెతుకులాడిన జీవితం. పతితమానవతతిమీద సానుభూతి చూపిన కవితాత్వికుడు. సాంఘిక దార్శనికుడు జాషువా. అంటూ జాషువా వ్యక్తిత్వాన్ని, కవితాశక్తిని దార్శనిక దృష్టిని ఎత్తిచూపుతాడు జి.యన్.రెడ్డి.

శ్రీమద్భగవద్గీత "ను అనువదించిన పైడిపాటి అప్పిరెడ్డి ని అభినందిస్తూ" హైందవ ధర్మానికి మూలకందమైన భగవద్గీత బైబిల్ తర్వాత ప్రపంచంలోని బహుబాషల్లోకి అనువదించబడిన గ్రంథంగా పేర్కొంటారు రెడ్డి.

ఎస్.గంగప్ప రాసిన "సారంగపాణి పద సాహిత్యం"కు పీఠికరాస్తూ "అటు సంప్రదాయ సంగీత ప్రియులు, ఇటు సాహిత్య చరిత్రకారులు "సారంగపాణికి సముచిత ప్రాధాన్యం ఇవ్వలేదు... సారంగపాణి మహనీయుడైనా విస్మృతుడైన వాగ్గేయకారుడైనా, అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య లాంటి వాగ్గేకారులకు యిచ్చిన ప్రాధాన్యత చరిత్రలో యివ్వబడలేదు" అంటారు.

ఆర్.పద్మావతి వెలువరించిన "బ్రౌన్ తెలుగు కావ్యసముద్ధరణ' పరిశోధనాగ్రంధానికి పీఠికరాస్తూ బ్రౌన్ని గూర్చి విలువైన సమాచారాన్ని అందిస్తారు. ఆంధ్రుల అదృష్టం కొద్ది అవతరించిన మహనీయుడు బ్రౌన్. ఆంధ్రులకు సర్వధా ఆరాధ్యుడు. తెలుగు సాహిత్య పునర్జీవనానికి, వికాసానికి ఆయన చేసిన సేవలు అపూర్వం, అనితరం, బహుముఖం. అటకలమీద మగ్గిపోతున్న వేలాది తాళపత్రగ్రంథాలకు విమోచన కలిగించి, రక్షించినవాడు. ఎన్నో మన తెలుగు గ్రంథాలను ఆయన పరిష్కరించకపోయినట్లయితే మన కావ్యాలు నామమాత్ర వశిష్టాలుగా వుండేవి. తెలుగు పండితులకు గ్రంథ పరిష్కార విద్యాభిక్షపెట్టిన తొలిసాహిత్యవేత్త. తెలుగు సాహిత్యంలో తొలిపరిశోధకుడు. గ్రంథ సంపాదకుడు .మన తెలుగు సాహిత్యానికి విలువలు వెలుగులు దేశాంతర వ్యాప్తికీర్తి కలిగించిన కర్మయోగి బ్రౌన్ అంటారు.

తెలుగులో పీఠికలు రాసే విధానానికి సూత్రపాయమైనట్టి సమాచారాన్ని అందించి, అందులో సాహిత్య మెలకువలను విప్పిచెప్పిన ఘనత ఆచార్య జి.ఎన్.రెడ్డిది. జి.యన్. రెడ్డి పీఠికలు అందరు చదువదగినవి. మరీ ముఖ్యంగా పరిశోధనా విద్యార్థులకు ముందు మాటలు రాసే సాహితీవేత్తలకు ఆలోచనామృతాలుగా భావించవచ్చును.

◆

# బహుపరాక్

- పి. లక్ష్మణరావ్
9441215989

జీవితాల్లో జరుగుతున్న
ప్రతి అన్యాయానికీ
రూపమిచ్చి వర్ణించలేనుగాని
జరుగుతుంది అన్యాయమని
ఖచ్చితంగా చెప్పగలను.
చేతికొచ్చిన పంట
నోటికాచ్చేసరికి
ఎగరేసుకుపోతున్న దళారీ గెద్దలు
విదిల్చిన ఎంగిలి మెతుకులు
బతుకుల్ని ఎగతాళి చేయడం అన్యాయమే!
జేబునిండా మోసుకెళ్ళిన డబ్బులు
మార్కెట్ మాయాజాలంతో
ఇంద్రజాలమై ఎగిరిపోయి
ఏం జరిగిందో తెలుసుకునేలోపే
జేబులు ఖాళీ అయిపోయి
బతుకుల్ని వెక్కిరించడం అన్యాయమే!
ఏ.టి.యం. నుండి పర్సునిండా
విత్ డ్రా చేసిన నెలజీతం
ఇన్‌స్టాల్‌మెంట్ ఖాతాల్లోకి జారిపోయి
వస్తువ్యామోహం గుప్పిట్లో
బతుకులు బంధీలైపోవడం అన్యాయమే!
నిలువెత్తు ఆరోగ్యంతో
నిబ్బరంగా తిరుగుతున్న మనం
వాయుకాలుష్యం, నీటి కాలుష్యం
ధ్వని కాలుష్యం, విధ్వంసక అణుకాలుష్యాలతో
ఒక్కసారిగా కుప్పకూలబడిపోయి
ఎరువులతోనూ, పురుగు మందులతోనూ
పెరిగిన పంటలతో నిస్సారమై
ఒళ్ళంతా గుల్లయిపోయి
ఐసియ్యుల్లోనూ, వెంటిలేటర్లపైన
ప్రాణాలు తేలుతుంటే
తిలాపాపం తలాపిడికెడు
అవడం అన్యాయమే!
పాలు కృత్రిమం, పళ్ళు కృత్రిమం
మసాలాలు కృత్రిమం, మనసులు కృత్రిమం
నీళ్లు కల్తీ, నెయ్యి కల్తీ



పప్పు కల్తీ, ఉప్పు కల్తీ
కుంభకోణాల మనీ, నకిలీ మనీ
కోల్ మనీ, కాల్ మనీ
ధనమాఫియా చేతుల్లో
జనదోపిడీ సర్వసాధారణమైపోయి
బతుకులు చిందరవందరైపోతుండటం అన్యాయమే!
మనుషులకు మనుషులే
ఎదురౌతున్నప్పుడు
ముఖాల్లో మొలుస్తున్న ప్లాస్టిక్ నవ్వులు
దూరమౌతున్న అనుబంధాలు
శూన్యసమాజాన్ని ఆవిష్కరిస్తుంటే
మనమెటు వెళ్తున్నామో
తెలియకపోతుండటం అన్యాయమే!

ఇప్పటికైనా మేల్కోకపోతే
చైతన్యులమై మొలకెత్తకపోతే
శేషజీవితమూ శుష్క ప్రాయమైపోతుంది
పుష్కలంగా నిష్క్రియా పర్వమైపోతుంది
బహుపరాక్! ♦

# మినీ కవితా రూపాల్లో కొత్త పోకడ - 'ముక్కాలు'




- టేకుమళ్ళ వెంకటప్పయ్య
9490400858

"ఆధునికాంధ్ర కవిత్వంలో వచ్చిన నవ్యకవిత, భావకవిత, అభ్యుదయకవిత, వచనకవిత, దిగంబరకవిత, విప్లవ కవిత, స్త్రీవాద కవిత, దళితవాద కవిత, అనుభూతికవిత ఇవన్నీ నవ్యకవితాంతర్భాగాలే! అన్ని కళారంగాలలో మాదిరిగానే కవితాక్షేత్రం కూడా సృజనశీలి-ప్రయోగశీలి....!

ఎన్ని ఉద్యమాలు, విప్లవాలు, పోరాటాలు, ధోరణులు, ప్రక్రియలు వచ్చి వెళ్తున్నప్పటికీ ఈ రాకపోకలు కవితలోని జీవలక్షణంగా భావించవలసి ఉంటుంది. ఈ ప్రయోగాల్లో ముఖ్య పరిణామం సంక్షిప్తత. తక్కువ పదాలతో ఎక్కువ ప్రభావాన్ని కలిగించేదిగా తెలుగులో మినీ కవితా ప్రక్రియ 1978-80ల మధ్య కాలంలో ఒక సంచలనం అయ్యింది. యువకవులు ఆనాడు ఉద్యమించి మినీకవితలు వ్రాశారు కాబట్టి అదొ మినీకవితా ఉద్యమంగా భాసిల్లింది. ఒక విధంగా ఇది సౌదామినీకవిత కూడా!

కేవలం యువకులే కాదు, లబ్ధ ప్రతిష్టులైన కవులు కూడా మినీకవితలు వ్రాశారు. "ఎన్ని గజాలు వ్రాశాడన్నది కాదు, ఎన్ని నిజాలు రాశాడన్నది ముఖ్యం" అన్నారు ఆరుద్ర. నిన్నటి మహాకావ్యం 18పర్వాలైతే నేటి మహాకావ్యం 18 అక్షరాలే అంటూ శ్రీశ్రీ కూడా ఈ ప్రక్రియను స్వాగతించారు. లోక్ నాయక్ జయప్రకాష్ నారాయణ్‌కు నివాళిగా ప్రముఖ కవి కాళోజీ "జేపీ" అనే శీర్షికతో "పుటకనీది/చావు నీది/ బతుకంతాదేశానిది" అని మూడూ పాదాల మినీకవిత వ్రాశారు.

డా.రావి రంగారావు, కొల్లూరి, జి.వి. పూర్ణచందు, జింబో, అలిశెట్టి ప్రభాకర్, ఆసు రాజేంద్ర ప్రభృతులు మినీకవితను సుసంపన్నం చేసిన ఆనాటి యువకులు. అద్దేపల్లి ఆనాడు మార్గదర్శకుడిగా నిలిచారు.

మినీకవితలు ఈ నాటికీ బలంగా వస్తూనే ఉన్నాయి. ఈ నలబై యేళ్ల కాలంలో ఎంతో మంది అనేక మినీకవితా సంపుటాలు వెలువరించారు. మినీకవిత కూడా అనేక కొత్త పుంతలు తొక్కింది. కవిత్వంలో సంక్షిప్తత అనేది ప్రధాన అంశంగా మారాక, ఇప్పటివరకూ రూపపరంగా వచ్చిన నూతన ప్రయోగాలన్నీ సంక్షిప్త కవితలే కావటం గమనార్హం. వాదాల కతీతంగా మినీకవిత అత్యంత దీర్ఘకాలంగా కొనసాగుతున్న కవితాఉద్యమం. భవిష్యత్తులో మరిన్ని మినీకవితా రూపాలకే ఎక్కువ అవకాశం ఉందనటానికి డా. పూర్ణచందు కొత్తగా చేసిన ముక్కాలు ప్రయోగం ఒక తార్కాణం.

డా.పూర్ణచంద్ శతాధిక గ్రంధకర్త. వృత్తిరీత్యా వైద్యుడు. తెలుగు వారి ఆహారచరిత్ర పరిశోధకుడు. తెలుగు భాష మూలాలను అన్వేషించి, నైలూ నుండి కృష్ణ దాకా, తెలుగే ప్రాచీనం లాంటి గ్రంథాలు వెలువరించాడు. తెలుగు భాషకు ప్రాచీనతా హోదా సాధకుల్లో ఒకడు. ప్రవృత్తిరీత్యా కవి, రచయిత, విమర్శకుడు. అన్నింటికీ మించి కార్యకర్త. మూడు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలకు కార్యదర్శకత్వం వహించిన సాహితీ సేవకుడు.

1988లో డా. పూర్ణచందు 'కాంతిస్వప్న' దీర్ఘ కవితా

కావ్యం వ్రాశారు. 2008లో 'వెలుగురాగాలు' మినీ కవితా సంపుటి తెచ్చారు. ఇప్పుడు పూర్తిగా ఒక నూతన కవితా ప్రక్రియగా 'ముక్కాలు' కవితా సంపుటిని వెలువరించారు. ఈ 'ముక్కాలు' సంపుటిలో మొత్తం 96 రసగుళికలున్నాయి. ఈ కవితలకు ఆంగ్లంలో విహారి (జే.యెస్.మూర్తి), హిందీలో డా.మాదిరాజు రామలింగేశ్వరరావు చేసిన అనువాదాలతో కలిపి మూడు భాషల్లో ఒకే పుస్తకంగా వెలువరించారు. ప్రతీ కవితకూ పాణి అందంగా వేసిన బొమ్మలు పాఠకులను ఆకట్టుకుంటాయి.

**కవిత మూడు పాదాల్లోనే ఉన్నప్పటికీ చదివే వారికి విభిన్న భావనలు స్ఫురిస్తాయి. పదేపదే పరిపరివిధాల ఆలోచింపచేస్తాయి.**

ముక్కాలు కవితలు ముచ్చటగా మూడు పాదాల్లోనే ఉన్నాయి. పాదాలకు పదాల నియమాన్ని పూర్ణచందు పెట్టుకోలేదు. ఎక్కువ కవితల్లో పాదానికి 3 లేక 4 పదాలు మాత్రమే ఉన్నాయి. ముక్కాలు కవితకు శీర్షిక ప్రాణప్రదం.

"నిన్నలన్నీ మూటగట్టి/పారేసిన చెత్తకుండీ... 'నేడు'/కొత్త చొక్కా కుట్టుకుంటూ... 'రేపు'" ఈ ముక్కాలు కవితకి శీర్షిక 'ఉగాది'.

"చిల్లులు పెడుతున్నానని గోడ తిట్లు/తిన్నగా దిగలేదని సుత్తిపోట్లు/శ్రమ నాది దండలు ఫొటోకి" దీన్ని ఒక మేకు ఆత్మవేదనగా భావించవచ్చు. దానికి శీర్షిక మేకిన్ ఇండియా. పైకి ఇది మేకు ఆత్మఘోషలా కనిపిస్తుంది. కానీ, భారతదేశంలో కొనసాగుతున్న శ్రమదోపిడీని ఎత్తి చూపిస్తుంది.

ఇంతటి అభివ్యక్తి ఉన్న కవితల్ని మనం చాలా అరుదుగా చూస్తుంటాం. అభివ్యక్తి అన్నికోణాల్లో ప్రదర్శింపగల శక్తి మినీకవితలో ఉంది కాబట్టే, ఈనాటికీ మినీకవితలు బహురూపాల్లో, బహుప్రక్రియల్లో సాక్షాత్కరిస్తున్నాయి. "మినీకవితకు ఉఛ్వాసం క్లుప్తత, నిశ్వాసం ధ్వని" అన్న డా.అద్దేపల్లి మాటలు ఎంతో అర్థవంతమైనవి.

కవిత్వంలో స్పష్టత, క్లుప్తత, సరళత, అర్థవిస్తృతి ఉండాలని అందరూ కోరుకునే విషయమే కానీ, దాన్ని సాధించడం అంత సుసాధ్యం కాదు. సంక్షిప్తత, సరళత, అర్థవిస్తృతి, వాక్య నిర్మాణంలో వేగం కలిగి సామాజిక చైతన్యం నిబిఢీకృతమై ఆలోచనా స్ఫోరకంగా ఉంటుంది. చెప్పేతీరు వాచ్యం కాకుండా కవితాత్మకంగా అలరిస్తుంది. కవి ఏదైనా విషయం చెప్పేటప్పుడు కవితలో ఓ క్రమవికాసం, సమన్వయం కనిపిస్తాయి. చదవగానే గుండెకు హత్తుకుని ఆనందానుభూతిని కలిగిస్తాయి. కవిత మూడు పాదాల్లోనే ఉన్నప్పటికీ చదివే వారికి విభిన్న భావనలు స్ఫురిస్తాయి. పదేపదే పరిపరివిధాల ఆలోచింపచేస్తాయి. 'ముక్కాలు' కవితాప్రక్రియ ద్వారా కవిత్వాన్ని కొత్తపుంతలు తొక్కించాడు కవి.

ఈ కవితా సంపుటికి ముందుమాట ముదావహంగా రాసిన అంతర్జాతీయ చిత్రకారుడు, పద్మశ్రీ ఎస్.వీ.రామారావు "మూడు భాషల్లో ఒకేసారి వెలువడుతున్న "ముక్కాలు" కవితా సంపుటిలో ఎన్నో కోణాలు ఉన్నాయి. ఎన్నో వైవిద్యభరిత భావాలను ఆయన వెలువరించారు. అన్నీ ఒకే ఉద్దేశ్యంతో రాసినవి కావు. వీటిని మ్యూజింగ్స్ అనవచ్చు. ఒకే బిగువున మనసులో సంచరించే భావాలు వచ్చినవి వచ్చినట్టుగా రాసినవే అన్నీ! అదొక అంతశ్చేతనా ప్రవాహంలా సాగాయి" అన్నారు. ఈ మాటలు అలోచింపదగినవి. రామారావు అధివాస్తవికత (సర్రియలిజం) చిత్రకళలో నిపుణుడు. అంతశ్చేతనలా సాగడం అనేమాట ఈ ముక్కాలు కవిత్వానికి ఒక ముఖ్య లక్షణంగా భావించవచ్చు.

" నన్ను 'నువ్వు' తెలుసుకుంటే జననం / నన్ను 'నేను' తెలుసుకుంటే మరణం / నన్నూ నిన్నూ కలిపితే జీవితం" ఈ కవిత మూడు పాదాలతో 35 అక్షరాలతో ఉంది. జీవితమంటే జననమరణాల కలగలుపే నంటాడు. జనన మరణ కాలచక్రంలో పరంపరానుగతంగా జరుగుతున్న విషయానికి సంకేతంగా శీర్షిక "పరంపర" అర్థవిస్తృతి కలిగించింది..

"రాజనీతి" అనే కవితలో "చెట్టుపైన రెండు పక్షుల తగూలాట / గెల్చింది పళ్ళారగింత...ఓడింది కళ్ళప్పగింత / గెలుపోటముల అద్వైతం" అంటారు. ఈ కవితలో గొప్ప ప్రతీక ఏమిటంటే "ఎన్నికలు". రెండు పక్షాల మధ్య ఎప్పుడూ దెబ్బలాటే! గెలిచిన పక్షం అందినకాడికి బొక్కడం షరా మామూలే! ఓడిన పక్షం మళ్ళీ ఎన్నికలెప్పుడా అని ఎదురుచూపులు చూడడం సారాంశం అయితే....గెలుపు ఓటములు ఎప్పుడూ నాణేనికి బొమ్మబొరుసులా అద్వైత స్థితిలో ఉండడం. అంతే గాకుండా మనం కొంచెం లోతుగా ఆలోచిస్తే రెండు పక్షాలు గుణంలో ఒకటే. బొక్కే దాని సమయం వచ్చింది బొక్కుతొంది. మళ్ళీ పరిస్థితి తారుమారై ప్రతిపక్షం కాస్తా

## రెక్కలు

- బండి ప్రసాదరావు
9866483732

"క్విట్ ఇండియా"
ఉత్సవాలు పణంగా
"సిట్ ఇన్" ఇండియా
ఆహ్వానాలు ఘనంగా!
పలుకులు పనులలో
భిన్నత్వం!

అవినీతి రహిత
పాలనలో దేశం
తాంత్రికుల పలుకుల్లో
మెఘా మోసం
నీతిగోచరము
అవినీతి గోపనీయం



మట్టి మురుగు
అనారోగ్యకరం
ఉత్పత్తితో మురుగు
మారణహోమం
తయారీ హబ్
తాంబూలాల (తంతు) మబ్బు

పదవీకాలం
పంచ వార్షికం
సంకల్పకాలం
దశ ,వార్షికం
ముందుచూపు (నేతమాట)
నాడి చూసి వాత

కులమత తత్వాలను
పారద్రోలండి
మతరాజ్యాన్ని
స్థాపిద్దాం రండి!
ఒంటికన్ను ఏలిక
రెండు కళ్ళ సిద్ధాంతం

ఇక యిల్లు పెద్దది
ప్రీమియం చిన్నది
స్వంత యింటి కల
తీర్చడమే పరమావది
రుణ షరతులకు
రణం పోటు! ◆

---

అధికార పక్షం కాగానే మళ్ళీ ఇదే విధానం చర్వితచర్వణం. 'ద్వా సపరా? సయుజా సఖాయా' అనే ప్రసిద్ధ ఋగ్వేద ఋక్కులో చెట్టుపైన రెండుపక్షులు...ఒకటి ఆరగిస్తుంటే రెండోది నిర్లిప్తంగా చూస్తూండటాన్ని వర్ణిస్తుంది. అద్వైత భావనగా దీన్ని డా. పూర్ణచందు సంభావించటం ఆయనకు గల బహుముఖీన గరిమకు నిదర్శనం.

మనం చిన్నప్పుడు చదువుకున్న పడవవాడు, వ్యాకరణ పండితుడి కథను గుర్తుకు తెచ్చే కవిత "వృత్తివిద్య". మహా పండితుడు ఈతరాదు/గజ ఈతగాడు చదువురాదు/మునిగే నావలో ఈతొస్తేనే పాండిత్యం". జీవితానికి వలసిన విద్య వస్తేనే ఈ సంఘంలో మనం మనగలం. అక్కరకు రాని విద్యలు ఎన్నివున్నా వృథా అన్న సత్యాన్ని బోధపరుస్తుంది.

"నాగరికత" కవితలో బండరాళ్ళ విత్తనాలు నాటారు/ పంటభూముల్లో పసిడి మేడలు!/నాగళ్ళు అటకెక్కాయి!!" అంటారు. పొలాలనన్నీ కాంక్రీటుజంగిల్స్ గా మార్చేయడం వల్ల నాగళ్ళు అటకెక్కడం జరిగింది.

మిరాసీ దారుడంటే అనువంశికంగా వచ్చిన హక్కును అనుభవించేవాడు. ఈ "మిరాసి" శీర్షికన రాసిన కవితలో "గాజు సీసా, పాత లాంతరు/తరతరాల తరగని ఆస్తి మాకు/ కోరినవన్నీ యిచ్చే భూతాలే లేవు" అనడంలో మిరాసీ దారుగా కొన్ని హక్కుల్ని పొందినప్పటికీ అవి నిరుపయోగ్యంగానే ఉన్నాయని చెప్పడం. ఆంగ్ల అనువాదంలో దీని శీర్షిక "డెరివేటివ్".డెరివేటివ్ అంటే ఉత్పన్నమవడం. అనువాదాలు చేసేటప్పుడు కవి ఏ ఉద్దేశ్యంతో పద ప్రయోగం చేశాడో అదే స్పృహతోనే (ఐడెంటిటీ ఆఫ్ మైండ్స్) అనువాదం ఉండడం హృద్యంగా ఉంది.

ముక్కాలు కవితలకు శీర్షికల్లో మేతావి, మేధానం, కాపాలన, గ్లోబలుడు, మేటిభారతం వంటి కొత్త పదబంధాలను సృష్టించాడు కవి. ఇలాంటి సమయాల్లో మనకు ఆంగ్లంలో కూడా కొత్త పదాలను సృష్టించడం కుదరదు కనుక చాలా దగ్గరగా ఉన్న ఆంగ్ల శీర్షికలను ఎన్నుకోవడంలో ఎంతో ప్రజ్ఞను ప్రదర్శించారు విహారి. హిందీ అనువాదాలు సహజంగానే దేశీయతకు దగ్గరగా ఉన్నాయి.

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ఒక సందర్భంలో కవి అనే వాడికి "చెవిలో చెవి" ఉండాలన్నారు. అంటే ఆయన కవిత్వం రాసేవారికి "కుశబ్ద" మేదో, "సుశబ్ద"మేదో పసిగట్టే నేర్పు ఉండాలన్న విషయం నొక్కి చెప్పారు. ఆ ఆలోచనలు మనకు ముక్కాలు కవిత లన్నిటిలో దర్శనమిస్తాయి. పదాల పోహళింపులో డా.పూర్ణచంద్ మంచి ఉపజ్ఞను ప్రదర్శించాడు. ఇందులోని ముక్కాలు కవితలన్నీ పాఠకుడిని ఆలోచనామృతంలో ముంచెత్తి కళ్ళతో గాకుండా హృదయంతో దర్శించవలసిన స్థితిని కలిగిస్తాయి. కవితల్లో ఏ ఒక్క పదాన్నీ తీసివేయడం కానీ, అదనంగా చేర్చడంగానీ కుదరని, అందమైన పదబంధాలతో శ్రోతలను/పాఠకులను అలరిస్తాయి. ◆

# అక్షరాలను పాతిపెట్టకు

- పి.విజయలక్ష్మి పండిట్



ఓ మూర్ఖుడా ..!
అక్షరాలను పాతిపెట్టకు,
నవరసాలొలికించే ఆ భీజాక్షరాలు
భూమిని తొలుచుకుని
మహా అక్షర వృక్షాలై
అక్షర లక్షల భీజాక్షరాలను వెదజల్లి
భీకర కవన వనాలను మొలిపిస్తాయి
ఆ అక్షరాలు కంద్లెర్రచేస్తే ..
ఒక్కో అక్షరం ఒక మిసైల్ అయి
విరుచుకు పడుతుంది నీపై ..,
ఎంతకాలం వేస్తావు ..
మనిషి ఆలోచనలకు సంకెళ్ళు ..?!
ఆ అక్షరాలే ఆ సంకెళ్ళను తెగ తెంచి
మనసు మాటలను విడుదల చేస్తాయి
వేష భాషలు దేశాలు వేరయినా...,
మనిషిలో ప్రవహించే రక్తమొక్కటే
ప్రేమ ఒక్కటే బాధ ఒక్కటే
భావమొక్కటే అని మరువకు ,
నీవు పాతిపెట్టిన నిక్షిప్తాక్షరాలను
కలాల హలాలతో మూర్ఖపు మట్టిని
దున్ని వెలికితీసే మహామహులు
కవులు రచయితలునారన్నది మరవకు
వారిని హింసిస్తే ఆ భీజాక్షరాలే
నిన్ను భయంకరంగా శిక్షిస్తాయి
అందుకే ...,
యుగయుగాలుగా తరతరాలుగా ..,
మనిషి మనుగడకు బాటలేసిన
కవుల కవితలను రాతలను పాతిపెట్టకు..!!

◆

# ముసురు గప్పిన నా పల్లె!

- కుంచె చింతాలక్ష్మీ నారాయణ
9908830477

పచ్చనాకు చీర చుట్టిన నా పల్లె
అదిగో చూడు వట్టిపోయి
కసాయి కొట్టుకు వలస పోతోంది!
ఊరు వాకిలి తోరణాలు ఎండిపోయె
ప్రతి గడప తలుపులు మూసె
మనిషినన్నవాడు మాయమైనట్లు
పచ్చని పసరిక రక్తం కక్కుతోంది!
ఊరరుగు నిశ్శబ్ద శిలయైనది!
జోడెడ్ల గలగంటలు మూగబోయి
పక్షుల కిలకిలారాగాలు మాయమై
నా పల్లె అడవి అంతరించిపోతోంది!
బంగారం పండే నాపల్లె నేలలు
నీటిజాడ లేక పగుళ్ళతో చీలికలై
విత్తు లేక మొలకే లేక ఆకాశమైదానమైనది!
ముసురు గప్పిన నా పల్లె ఊపిరైనా పీల్చుకోలేక
ఆకలికేకల రోదనలతో భవిష్యత్ వెత్తుక్కుంటూ
నా పల్లె భోరుమని ఏడుస్తూ వలసపోతోంది!



బంధాలు బంధువులు బంధుత్వాలు లేని
సర్వం కలుషితమైన పట్నం అనే
నరకానికి చేరువవుతోంది!
పట్నం అనే నరక ద్వారాలు తెరుచుకున్నాయి!!

◆



- డా. యం.ప్రగతి
9440798008

# గువ్వగూడు

సెల్ ఫోన్ అదేపనిగా మోగుతుండటంతో చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి ఫోన్ తీశాను. ఏదో కొత్త నంబరు. "హలో గీతా మేడమ్ గారేనా?" అవతలివైపు నుంచి పరిచయం లేని గొంతు. "నేనే మాట్లాడుతున్నాను, మీరెవరు?" అడిగాను. "మేడమ్ నమస్తే. నేను రహీం, మీ స్టూడెంట్ ను." అవతలి గొంతు. "రహీం...?" గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించాను. "అదే మేడమ్! మీరు హైస్కూల్లో పనిచేస్తున్నప్పుడు 8,9,10 తరగతులు చదివాను." సంవత్సరాలతో సహా గుర్తు చేసే పనిలో పడ్డాడు. "ఆ... గుర్తొచ్చింది రహీం. బాగున్నావా? ఏం చేస్తున్నావు? నా నంబరెట్ల దొరికింది?" ప్రశ్నలవర్షం గుప్పించాను. పాత శిష్యులు కలిసినా, మాట్లాడినా చెప్పలేనంత సంబరం నాకు. ఆ మాటకొస్తే ఏ టీచరుకైనా ఇంతేనేమో! సాఫ్ట్వేర్ ఇంజనీరుగా పనిచేస్తున్నట్లు చెప్పాడు రహీం. అప్పటి నా కొలీగ్ రాధాకృష్ణ గారు నా నంబరిచ్చారట. "మిగిలిన వాళ్ళంతా ఏంచేస్తున్నారు?" నాకు గుర్తున్నంత వరకు పేరుపేరునా అడిగాను. "అందరూ బాగానే సెటిలయినారు మేడమ్. మీరు అందరినీ చూడొచ్చు. వచ్చే శనివారం పూర్వ విద్యార్థుల సమావేశం ఏర్పాటు చేసినాము. మీరు తప్పకుండా రావల్ల." విషయం చెప్పాడు రహీం. "తప్పకుండా వస్తాను. మిమ్మల్నందిరినీ కలిసే అవకాశాన్ని ఎలా వదులుకుంటాను?" ఫోన్ పెట్టేశాను. రహీం ఫోన్ తో మనసంతా ఒక్కసారిగా రెండు దశాబ్దాల వెనక్కి జారింది.

♦

దివంగత ముఖ్యమంత్రి ఎన్టీరామారావు చనిపోవడానికి ఆర్నెల్ల ముందు...

చదువు పూర్తయ్యీ కాగానే డియస్సీలో స్కూల్ అసిస్టెంట్ పోస్టుకు సెలెక్టయ్యాను. అనంతపురానికి ఇరవైఐదు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఓ మండలకేంద్రం నుండి మరో పది కిలోమీటర్ల అవతల మతసామరస్యానికి పేరుగాంచిన ఓ గ్రామంలోని హైస్కూల్లో సైన్స్ అసిస్టెంట్ గా చేరాను. పుట్టింది

పల్లెటూరే అయినా పెరిగిందంతా పట్టణ వాతావరణం లోనే అయినందువల్ల పల్లెల గురించి అతికొద్ది పరిచయమే నాకు. ఉద్యోగంలో చేరాకనే కాస్త దగ్గరగా రాయలసీమ పల్లెల గురించి తెలుసుకోవడానికి అవకాశం దొరికింది. చుట్టుపక్కల గ్రామాల నుంచి పిల్లలు మా స్కూలుకు వచ్చేవారు. సైకిళ్ళు చాలా కొద్దిమందికి మాత్రమే ఉండేవి. చాలామంది నడిచి వచ్చే వాళ్ళు. కాళ్ళకు చెప్పులు కూడా చాలా మందికి ఉండేవి కాదు. ఒంటిపూట బడులు పెడితే వాళ్ళ తిప్పలు చూడాలి, పైనా, కిందా కూడా కాలిపోతుందని సాయంత్రం వరకు ఆగి వెళ్ళేవాళ్ళు. తాగునీటి వసతి లేదని కొంతమంది క్యారియర్లు కూడా తెచ్చుకునేవారు కాదు. (అప్పటికి మధ్యాహ్న భోజన పథకం అమల్లో లేదు)



అప్పుడే చదువై, ఉద్యోగంలో చేరడంవల్ల వాళ్ళలో నాకు నేను కనిపించేదాన్ని. గట్టిగా అరవలేను, కొట్టనూలేను. సన్నగా, చిన్నగా ఉండే నన్ను ఆ పిల్లలు కూడా తమలో కలుపుకొనేవాళ్ళు. ఆడపిల్లలయితే చిక్కగా కట్టిన కనకాంబర మాలలు పోటీలు పడి తెచ్చిచ్చే వాళ్ళు. అప్పటికింకా పెళ్లి కాకపోవడంవల్ల ఇంటిదగ్గర బాధ్యతలు లేవు. పిల్లలకు పాఠాలు చెప్పడంలోనే నా ఆనందమంతా ఉండేది. పిల్లలు కూడా పోటీగా చదువుతూ నేను ఇచ్చిన యాక్టివిటీస్ లో ఉత్సాహంగా పాల్గొనడం నాకు మరింత సంతోషాన్నిచ్చేది. అనంతపురం నుంచి బస్సులో రోజూ వెళ్లి రావడం మాత్రమే కష్టంగా ఉండేది. అదికూడా ఎందుకంటే బస్సులు సరిగ్గా ఉండకపోవడం, ఇప్పటిలాగా షేరాటోల జోరు లేకపోవడంతో అప్పుడప్పుడు కొద్దిగా లేటయ్యేది. ఒకరోజు అలాగే ఓ పది నిమిషాలు లేటయ్యాను. మొదటి పీరియడ్ ఎనిమిదవ తరగతి సైన్స్ క్లాసు. క్లాసులోకెళ్ళి ముందుగా హెూం వర్కు నోట్సులు తెమ్మన్నాను. నలుగురు తప్ప అందరూ తీసుకొచ్చారు. "ఎందుకు రాయలేదు, ఏం చేస్తున్నారు ఇళ్ళ దగ్గర?" నా చిరాకంతా లేటయినందుకేనని వాళ్ళకూ అర్థం అవుతోంది. "రాసినా మేడమ్, ఇంటికాడ మర్సొచ్చినా" ఒకడి సమాధానం. మరొకడిదీ అదే సమాధానం. "నిన్నట్యాల నేను బడికి రాల్యా మేడమ్." ఒకమ్మాయి జవాబు. ఒక్కడు మాత్రం నిశబ్దంగా నిలబడున్నాడు. "నీ సంగతేంట్రా?" వాడు నోరు తెరవకుండా అలాగే చూస్తూ నిలబడ్డాడు. "ఏంట్రా మాట్లాడవు?" అరిచాను. మిగిలిన పిల్లలు గుసగుసగా నవ్వుతున్నారు. "సైలెన్స్!" పిల్లల్ని నోరు మూయించి, "నీ పేరేంటి?" అడిగా వాణ్ని. నా ప్రశ్నకు వాడు నోరు తెరవలేదు గానీ మిగిలిన పిల్లలు అరిచారు. "కుల్లాయి మేడమ్!" "మీరు నోళ్ళు మూయండి. రేయ్ నీ సైన్స్ నోట్సిలా తీసుకురా." గదిమాను. పది నిముషాలు వెతికి ఓ నోట్సు లాంటిది తెచ్చాడు వాడు. అందులో రాసింది చదవడానికి ప్రయత్నించాను. అక్షరాలు విడివిడిగా చదవాల్సిందే తప్ప ఒక్క పదమూ అర్థం కాలేదు నాకు. వాడినే చదవమన్నాను. నోరు పెగిలితే వొట్టు. ఇక వాడికి చదువు చెప్పలేనని నాకర్థమయింది. నా ఓటమిని ఒప్పుకోలేక ఎప్పుడూ లేనిది బెత్తంతో రెండు దెబ్బలు వేశాను. ఆ రోజంతా నాకు అన్యమనస్కంగానే ఉంది. స్టాఫ్ రూమ్ లో సహెూపాధ్యాయులతో మొరపెట్టుకున్నాను. "ఈ పిల్లలకు అక్షరాలు రాయడం కూడా రాదు, చదువెలా చెప్పాలి?" "అప్పుడే బాధపడటం మొదలయితే ఎట్లమ్మా? నువ్వింకా ఎన్నేళ్ళు పన్జేయాల?" సీనియర్ టీచర్లు భయపెడుతున్నట్లు మాట్లాడారు. "ఎలిమెంటరీ స్కూల్లో ఏమీ నేర్చుకోకుండానే ఇక్కడికొస్తారు. సరైన ఫౌండేషన్ లేకపోతే మనం మాత్రం ఏం చేయగలం? అటు తల్లిదండ్రులూ పట్టించుకోరు. మనం అక్షరాలే నేర్పాలా, మన పాఠాలే చెప్పుకోవాలా?" మాథ్స్ అసిస్టెంట్ గళం నా బాధతో కలిసింది. అప్పుడే వచ్చిన హిందీ పండిట్, "ఏం మేడమ్, ఈ రోజు బెత్తానికి పని చెప్పినారంటనే. అయినా ఆ కుల్లాయిగానికి ఎన్ని బెత్తం దెబ్బలు పడినా చదువు రాదు మేడమ్!" నిట్టూర్చాడు. నేను కూడా ఇక చదవలేని కుల్లాయి లాంటి వాళ్ళనొదిలేసి నేను చెప్పే చదువు అర్థం చేసుకోగలిగిన వాళ్ళకే చెప్పాలని తీర్మానించుకున్నా. నేను గమనించినంతలో కుల్లాయి ఎప్పుడూ ఇతర పిల్లలతో కూడా సరిగ్గా కలిసేవాడు కాదు. ఎవరితోనూ మాట్లాడటం కూడా నేనెప్పుడూ చూడలేదు.

ప్రభుత్వం ప్రారంభించిన కొత్త కొత్త పథకాలలో భాగంగా జన్మభూమి, శ్రమదానం కార్యక్రమాలు పాఠశాలల్లో నిర్వహించాలని ఆదేశాలు జారీ చేసింది. ఓ శనివారం పాఠాలు పక్కనపెట్టి పిల్లలతో శ్రమదానం చేయించేపనిలో పడ్డాము. స్కూలుకు ఓ వైపు కొండలాంటి గుట్ట. మరోవైపు లోయలాంటి

పెద్ద వెడల్పాటి గుంత. ఆ గుట్టను తవ్వి ఈ గుంతను నింపేపని చేయించాలని నిర్ణయించాము. పిల్లలందరూ కేరింతలు కొట్టుకుంటూ ఎవరి శక్తికొద్దీ వారి పనిలో పడ్డారు. మట్టి తవ్వే వాళ్ళు కొందరు తట్టలకెత్తే వాళ్ళు కొందరు ఆ తట్టలు అంచెలంచెలుగా మోసుకుపోయి గుంతలో మట్టి గుమ్మరించే వాళ్ళు కొందరు. కొంతమంది పిల్లలు అన్నం, పప్పు వండుతున్నారు. పనిచేయడం ఇష్టంలేని వారు కొందరు చేస్తున్నట్లు నటిస్తున్నారు, కొందరు చాటున నక్కుతున్నారు. పిల్లలందరిలో నాకు అమితాశ్చర్యం కలిగించింది కుల్లాయి పని. మిగిలిన వాళ్ళతో ప్రమేయం లేకుండా వాడొక్కడే తన పాటికి తను ఓ వైపు గుట్టను శక్తి కొద్దీ గడ్డపారతో తవ్వుతూ, పారతో గంపలు నింపుతున్నాడు. మిగితా పిల్లలు వరుసగా నిలబడి మార్చుకుంటూ గుంతలో పోస్తున్నారు. కుల్లాయి వేగాన్ని అందుకోవడం వాళ్ళకు సాధ్యం కావడంలేదు. భోజనాలప్పుడు గమనించాను, వాడి పర్సనాలిటీకి, వాడు తినే తిండికి పోలికే లేదు. చెబితే అతిశయోక్తి అనిపించొచ్చు గానీ, నలుగురు తినే తిండి వాడొక్కడే తింటున్నాడు. నిజమే, అంతపని చేయాలంటే సత్తువ కావద్దూ?



అదిమొదలు కుల్లాయి దినచర్యను గమనించడం నాకు అలవాటుగా మారింది. చదువులో వాడు పనికిరాక పోవచ్చుగానీ, వాడు చేసే పనులు చూస్తే ఆశ్చర్యమేసేది. మొక్కలకు గుంతలు తీయడం, పాదులు చేయడం, నీళ్ళు పోయడం, స్కూలు మైదానంలో బరువైన రాళ్ళు రప్పలు తొలగించడం లాంటి పనులు అత్యంత సునాయాసంగా, నైపుణ్యంగా చేసేవాడు. నాకు తెలియకుండానే వాడి మీద అభిమానం పెరగసాగింది. "వాల్ల నాయన వాడు సిన్న పిల్లోడప్పుడే పురుగు (పాము) కుట్టి సచ్చిపోయినాడు మేడమ్. వాల్లమ్మకు వాడొక్కడే. కూలికి పోయి పానాలన్ని వాని మిందనే పెట్టుకొని సాకుతాంది." పిల్లలు కుల్లాయి వివరాలందించారు. నాకు వాడి మీద జాలి కూడా కలిగింది. వాడితో మునుపట్లా కాకుండా ప్రేమగా మాట్లాడేదాన్ని, అప్పుడప్పుడు క్యారియర్ ఇచ్చేదాన్ని. "ఏందమ్మా, మామూలుగా అయివారమ్మలకు బాగా చదివే పిల్లలంటే ఇష్టముంటాది, నీకేంది ఈ చదువురాని మొద్దు మీద శ్రద్ధ?" సహోపాధ్యాయులు విసుక్కునేవారు. "తల్లికి తన బిడ్డల్లో బలహీనంగా ఉండే బిడ్డమీదే ఎక్కువ మమకారం ఉంటుందట. నాకూ అలాగేనేమో. అయినా వాడు చేసే పనులు నేను చేయలేను, అందుకనే వాడంటే నాకు అభిమానం." నా సమాధానంతో వాళ్ళు మరింత ఆశ్చర్యపోయారు. "నీకేం ఖర్మ ఆ పనులన్నీ చేయడానికి? చక్కగా చదువుకున్నావు, చదువైన సంవత్సరం లోపే ఉద్యోగం సంపాయిచ్చావు. ఇంకో రెండు మూడేండ్లుంటే లెక్చరర్ అయ్యి పచ్చింకుతో సంతకాలు చేసేస్తావు." అంటూ మోసేశారు. మన దేశంలో మేధస్సుకే గానీ శ్రమకు గౌరవం లేదు. కానీ దాని విలువ తెలుసు. అందుకే ఆ తర్వాత నేనెప్పుడూ కుల్లాయికి చదువు రాలేదని చిన్నచూపు చూడలేదు. నాకు నా కుటుంబ నేపథ్యం వల్ల తేలిగ్గా వంటబట్టిన చదువు, వాడి పరిస్థితుల వల్ల వాడికి అబ్బలేదు. వాడు అవలీలగా చేసే పనులు నాకు చేతకావు. ఆ రకంగా వాడు నాకంటే గొప్పవాడే కదా! నాలో మార్పును వాడు గమనించాడు. బిడియం వదలి మెల్లగా నాతో మాట్లాడటం మొదలుపెట్టాడు. "మేడమా!" అంటూ వాడు పిలిచే పిలుపు తమాషాగా ఉండేది. అప్పుడప్పుడు పచ్చి వేరుశనక్కాయలు తెచ్చిచ్చేవాడు. క్లాసు పెరుగుతోంది కానీ కుల్లాయి చదువులో పెద్ద మార్పేమీ లేదు. బాగా చదువుతున్న, చురుకైన పిల్లల్లో నా బోధనతో స్ఫూర్తిని పెంపొందించడంతో పాటు, ఓ రకంగా చదువుతున్న వాళ్ళను కూడా దారిలో పెట్టగలుగుతున్నాను కానీ కుల్లాయిలాంటి వాళ్ళను మార్చలేక పోతున్నాననే బాధ నాలో ఉండి పోయింది.

ఓ రోజు బడి వదిలేసరికి బస్సులన్నీ వెళ్ళిపోయాయి. ఇంకే వాహనాలు లేవు. ఇక కాళ్ళకు పని చెప్పాల్సిందేనని అందరం నడవడం మొదలు పెట్టాము, కొంచెం దూరం పోతే వేరే రూట్లోనన్నా ఏవైనా తగుల్తాయేమోనని. అదీ తగలక పోతే మండలకేంద్రం వరకు నడవాలి. నాకసలే ఆయాసం. కానీ తప్పదు కదా అని నడుస్తున్నాను. ఇంతలో సైకిల్ పైన రివ్వుమంటూ వచ్చాడు కుల్లాయి. "ఎక్కు మేడమా, నేనిడిసిపెట్టొత్తా." "వొద్దులేరా" మొహమాటపడ్డాను. "ఎక్కు మేడమా, కింద పడేయ్యన్లే. అంతదూరం నువ్వు నడసలేవు." అభయమిచ్చాడు. "పర్లేదులే ఎక్కమ్మా. అవతల మీ ఆయన కంగారు పడుతుంటాడు. అసలే కొత్తగా పెళ్ళయిన దానివి." మిగిలిన స్టాఫ్ ధైర్యం చెప్పడంతో వాడితో బయల్దేరాను. దారిలో

ఎక్కడా ఏ వాహనమూ తగలక పోవడంతో వాడు పది కిలోమీటర్లు సైకిల్ తొక్కి నన్ను బస్సు దగ్గర వదిలాడు. ఈ సంఘటనతో వాడి మీద నాకు కృతజ్ఞతాభావం కలిగింది. ఇంకోరోజు ఉదయం బస్సు దిగి స్కూలు వైపు నడుస్తున్నాను. దారిలో ఓచోట ప్రైమరీ స్కూలు పిల్లల గుంపు. కేకలేస్తూ గోల చేస్తున్నారు. కుల్లాయి వాళ్ళను గదుముతున్నాడు. "ఏంట్రా... ఏం చేస్తున్నారు?" గద్దింపుగా అడిగాను. "సూడు మేడమా! ఈడేందో గువ్వది గూడు కింద పడిపోయినాది. గువ్వపిల్లల్ని ఈ నాయాండ్లు బెదరగొడతాండరు." నాతో మాట్లాడుతూనే కిందపడిన గూడును సరిచేసి, గువ్వపిల్లలను జాగ్రత్తగా తీసుకొని చెట్టు మీదకు చేర్చాడు. కిందకు దిగి పిల్లలను కసిరి పంపించాడు. "నీ పుణ్యమాని గువ్వగూడు పదిలం, గువ్వ పిల్లలు భద్రం. మంచిపని చేశావురా కుల్లాయి. శభాష్!" అభినందించాను.



కుల్లాయి స్కూలు చదువు ముగిసింది. తెలుగు తప్ప అన్ని సబ్జెక్టులు ఫెయిలయి, స్కూల్లోంచి బయట పడ్డాడు. పది తప్పాక ఇంక చదువు జోలికి పోకుండా సేద్యంలో పడ్డాడు. కొంతపొలం గుత్తకు తీసుకొని వ్యవసాయం మొదలు పెట్టాడు. స్వతహాగా మంచి పనిమంతుడు కావడంతో బాగానే నెట్టుకొస్తున్నట్లు కనిపించినప్పుడల్లా చెబుతుండేవాడు. మరో రెండేళ్లకు నాక్కూడా ఆ స్కూలుతో, ఆ ఊరితో రుణం తీరిపోయింది. జూనియర్ కాలేజీలో లెక్చరర్ గా ప్రమోషన్ తో అనంతపురంలో పోస్టింగ్ ఇచ్చారు. స్కూలు నుంచి రిలీవయి వస్తున్నరోజు బస్టాప్ లో ఉండగా గసపెట్టుకుంటూ వచ్చాడు కుల్లాయి. "టవున్లోకే యేసినారంట గదా మేడమా! ఇన్ని దినాలకు నీకు బస్సులో తిరిగే పని తప్పినాది.'' సంతోషపడ్డాడు. బస్సెక్కగానే రెండు బరువైన సంచులు నా దగ్గరుంచాడు. "ఏమిట్రా ఇవి? ఎందుకు?" "పచ్చెనక్కాయలు, పరింకాయల్లే మేడమా, నువ్వు తినకుంటే సారుకియ్యి." కదుల్తున్న బస్సులోంచి దూకి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నేనెప్పుడూ ఆ ఊరు వెళ్ళడం కుదరలేదు. రెండు దశాబ్దాలు గడచిపోయినా, ఇంకా అప్పటి జ్ఞాపకాలు సజీవంగానే ఉన్నాయి. అప్పటి కొలీగ్స్, పిల్లలూ అందరూ ఎలా ఉన్నారో? అందరినీ ఎప్పుడెప్పుడు చూద్దామా అని మనసు తహతాహలాడుతోంది.

◆

శనివారం రానే వచ్చింది. అప్పటి జ్ఞాపకాలను గుర్తు చేసుకుంటూ బస్సులో వెళ్ళాను. మండలకేంద్రం వద్ద ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఎక్కడ చూసినా సెల్ ఫోన్ సర్వీసు సెంటర్లు. దండిగా షేరాటోలు. ఆటోలో ఎక్కి ప్రయాణం చేస్తూ, రోడ్డు కిరువైపులా పరిసరాలను అప్పటికీ ఇప్పటికీ పోల్చుకుంటున్నాను. దాదాపు నలభై నిమిషాలకు ఊరు చేరాను. ఊళ్ళో పెద్దగా చెప్పుకోవాల్సిన మార్పులేవీ లేవు. కూల్ డ్రింక్ షాపులు, టీ బంకులు కొత్తగా వెలిశాయి. సెంటర్లో ఆటో దిగి తెలిసిన వాళ్ళెవరన్నా కనబడతారేమోనని పరికించసాగాను. కొందరు గుర్తు పట్టి పలకరించారు. "యేమయివారమ్మా బాగుండావా? బాగా ఒళ్ళు చేసినావే. ఈడుండప్పుడు పలసాగుంటివి." వాళ్ళతో మాట్లాడుతుండగానే నా పాత విద్యార్థులు చుట్టుకొని సాదరంగా స్కూలు దగ్గరికి తీసుకుపోయారు. అప్పటికే చేరిఉన్న నా పాత సహోపాధ్యాయులంతా ఆత్మీయంగా మాటలు కలిపారు. విద్యార్థుల్లో నేను గుర్తుపట్టిన వాళ్ళు చాలా తక్కువ అనేకంటే దాదాపు లేరనే చెప్పాలి. వాళ్ళంతట వాళ్ళే పేర్లు చెప్పి గుర్తుచేశారు. ఎవరెవరు ఏం చేస్తున్నారో చెప్పారు. నా కళ్ళు కుల్లాయి కోసం వెదికాయి. ఎక్కడా అతని ఊసేలేదు. బహుశా పెద్ద చదువులు చదవలేదు కాబట్టి మొహం చెల్లక రాలేదేమో అనుకున్నా. సాధారణంగా పూర్వ విద్యార్థుల సమ్మేళనాల్లో మంచి కెరీర్ ఉన్నవాళ్ళే కలుస్తుంటారని విన్నా. కార్యక్రమాలన్నీ ముగింపుకొచ్చాయి. కుల్లాయి ఊసే లేదు. ఇక ఉండబట్ట లేక కొందరిని అడిగాను. "కుల్లాయి కనిపించలేదే?" ఆ ఊళ్లోనే ఉన్న మరో పాత విద్యార్థి తిమ్మరాజు చెప్పాడు, "కుల్లాయి సచ్చిపోయినాడు మేడమ్." నాకు షాక్. "ఏ... ఏంటీ.... ఎప్పుడు.... ఏమయింది....?" తడబడుతూ అడిగాను. "ఆర్నెల్లయింది మేడమ్. గాలి మరల్లో పనికి పోయింటే షార్ట్ సర్క్యూటయి కరెంటొచ్చి కాలిపోయినాడు." "అదేంది, కుల్లాయి సేద్యం చేస్తుండె కదా!" "ఊను మేడమ్, చేస్తాండె. తొలి దినాల్లో సేద్యం బానే ఉండింది గానీ రాన్రానూ బోర్లెండిపాయె, వానసుక్క రాకపాయె, బాకీలెక్కువాయె. ఇంక గిట్టుబాటు గాదని ఇన్ని దినాలు గొర్లు కాసేకి పోయిండె.

అదీ కుదరక గాలిమరల్లో పనికి సేరినాడు. ఆడ పనిలో ఉండంగా షార్ట్ సర్క్యూటయి కాలి బొగ్గయిపోయినాడు." నాకు నోట మాట రాలేదు. ఎంతో పనిమంతుడైన మనిషి బతుకుబండి లాగలేక జీవితంలో ఓడిపోయి, అర్ధాంతరంగా కాలి బూడిదయిపోయాడు. "వాళ్ళమ్మ... భార్యాపిల్లలు....?" లోగొంతుకతో అడిగాను. "వాల్లమ్మకు ముందే మనిసి మెత్తగయిండె, ఇంగ వాడు సచ్చిపోయినంక కుమిలిపోయి మంచం బట్టినాది. కుల్లాయి పెండ్లాం కూలికి బోయి ముసలాయిమ్మను, ఒక్కగానొక్క కొడుకును సాకేదానికి అగసాట్లు పడతాంది." తిమ్మరాజు చెప్పిన కుల్లాయి విషాదగాథతో నా కళ్ళనీళ్ళు నిండి మసకబారాయి. కాసేపటికి తేరుకొని అడిగాను. "నన్నోసారి వాళ్ళింటికి తీసుకెళ్తావా?" నన్ను ప్రశ్నార్థకంగా చూస్తూ సరేలెమ్మని తీసుకెళ్ళాడు తిమ్మరాజు.



తడికలతో కప్పిన వసారా, దాని వెనుక ఏ కాలం నాటిదో ఒక్క గదివున్న మంటి మిద్దె. వసారాలో నులక మంచం పైన పడుకొని ఉన్న ఎముకల గూడు లాంటి ముసలావిడను కుల్లాయి తల్లిగా పరిచయం చేశాడు తిమ్మరాజు. "మాకు సదువు సెప్పిన అయివారమ్మ" తిమ్మరాజు మాటలతో ఆమె నెమ్మదిగా లేచి కూర్చుంది. "ఆ... కుల్లాయిగాడెప్పుడూ సెప్తాండె." గుర్తు తెచ్చుకుంటూ అంది. పక్కింట్లో నుంచి ఓ పాత కుర్చీ తెచ్చాడు తిమ్మరాజు. వచ్చానే గానీ ఏం మాట్లాడాలో అర్థం కాలేదు నాకు. "బాగున్నారా?" అని అడగలేను. అంత పనికిమాలిన ప్రశ్న మరొకటుండదు. కుల్లాయి గురించి విచారించి బాధ పెట్టలేను. అసలెందుకొచ్చానో నాకే తెలియలేదు. కాసేపు మౌనంగా ఉన్నాను. "ఏమ్మా నీల్లు తాగుతావా?" నా ఇబ్బంది అర్థమయినట్టు ఆమే నిశబ్దాన్ని ఛేదిస్తూ అన్నది. "ఆ... ఆ.." దాహం లేకపోయినా వద్దనాలనిపించలేదు. నీళ్ళు తాగుతూ అతి కష్టం మీద నోరు తెరిచాను. "కుల్లాయి గురించి ఇప్పుడే తెలిసింది. ఓసారి మిమ్మల్ని పలకరిద్దామని..." నసుగుతూ అన్నాను. "ఏం జేస్తామమ్మా. అంతా మా తలరాత. వాని తిన్ననే వాని కొడుక్కూ తండ్రి లేని బతుకు రాసిపెట్టినాడా దేవుడు." ఆమె కళ్ళల్లో నీళ్ళు ఎప్పుడో ఇంకిపోయి నిర్జీవంగా ఉన్నాయి. "కుల్లాయి భార్య...?" ఇంట్లోకి చూస్తూ అడిగాను. "పనికి పోయినాదమ్మా. ఆయమ్మ కూలికి బోతేనే మాకింత బువ్వ. ఇంత సిన్న వయసుకే ఆ బిడ్డకీ గతి బట్టింది." దుఃఖాన్ని అణచిపెట్టుకుంటున్నట్లు అర్థమవుతోంది నాకు. "కుల్లాయికి చదువు రాకపోయినా పని బాగా చేసేవాడు. సేద్యంలో బాగా రాణిస్తాడనుకున్నా. ఇలాగవు తుందనుకోలేదు." నాకు పరామర్శించడం చాత కాలేదు. "అవు తల్లీ, అంతా అట్నే అనుకుండారు. అయినా తల్లీ అంతమంది పిల్లోల్లకి సదువు బాగ సెప్పినావని అంతా సెప్తాంటే ఇనింటి. నా కొడుకు మంచి పనిమంతుడని మురిసిపోయి మెచ్చుకుంటివి గానీ, వానికి నాలుగచ్చరం ముక్కలు నేర్పిచ్చేకి నీకు శాతగాకపాయె గదమ్మా. ఏందో వానికి సదువు మింద బుద్ధి పుట్టిచ్చింటే, ఏదోకట్ల కావలి పనికన్న కుదురుకుంటాండెనేమో. అంత పనిమంతునికీ సేద్యం శాతగాకపాయె. ఏదో గాలి మిసన్ల కాడ బతుకుదామని పొయి మనిసే కాలి బూడిదయిపాయె. ఇయ్యన్నీ సూసేకి నన్నింకా బతికిచ్చినాడా దేవుడు." ఆమె మాటలకు సంజాయిషీ ఇచ్చుకొనే ధైర్యం నాకు లేదు. మళ్ళీ మౌనమే సమాధానం. ఎక్కడినుంచో చిరుగుల బనియను, జారిపోతున్న నిక్కరుతో నాలుగేళ్ల పసి పిల్లాడు అక్కడికొచ్చాడు. "కుల్లాయి కొడుకు మేడమ్." తిమ్మరాజు చెప్పాడు. "ఇలారా" పిలిచాను. వాడు బిడియంగా చూస్తున్నాడు. "పర్లేదులే రా!" మళ్ళీ పిలిచాను. ఈసారి రెండడుగులు ముందుకేశాడు. దగ్గరికి తీసుకొని అడిగాను. "నీ పేరేంటి?" "రాజు" చిన్నగా చెప్పాడు. పర్సులోంచి చేతికొచ్చిన నోట్లు తీసి ఇవ్వబోయాను. "వొద్దమ్మా, అయి నీకాడే ఉన్నీ. మా బతుకు మేము ఎట్నో తిన్న బతుకుతాండము" ఆమె మాటలు నిష్టూరంగా వినిపించాయి నా చెవులకు. మౌనంగా డబ్బులు పర్సులో పెట్టేశాను. అప్పుడెప్పుడో నేలజారిన గూడును సరిచేసి గువ్వ పిల్లలను రక్షించాడు కుల్లాయి. ఇప్పుడు తన గూడే రాలిపోయింది. ఈ గూడును సరిచేసే వారెవరు? కుల్లాయి తల్లి మాటలతో నాలో మథనం మొదలయింది. బస్సులో కూర్చున్నా, కుల్లాయి నాలుగేళ్ళ కొడుకు, నేలరాలిన గువ్వలు మళ్ళీ మళ్ళీ నా కళ్ళముందు కదులుతున్నాయి.

◆

# నానీలు

- పాలపర్తి ధనరాజ్
9550593901

నిర్లక్ష్యానికి నిలువుటద్దం
ప్రభుత్వాసుపత్రులు
నిలువు దోపిడీకి నిలువెత్తు అద్దం
కార్పొరేట్ ఆస్పత్రులు

ఇడ్లీ బోండాలా
మేం ఒప్పుకోం
పిజ్జా నూడుల్సా
అయితే ఓకే - పిల్లలు

బండెనక బండికట్టి
నాటి పాత పాట
ఆటో వెనక ఆటో కట్టి
నేటి సరికొత్త పాట

పార్టీలో ఉన్నప్పుడు
అధినేతే నాయకుడు
పార్టీ ఫిరాయించినపుడు
అతనే ప్రతినాయకుడు



ప్రస్తుతం బిపీ షుగర్లు
ఉన్నాయంటే సాధారణం
పదేళ్లు పోయాక
అవి లేవంటే ఆశ్చర్యం

ఎన్నికలపుడు
ప్రజలంటే ముద్దూ మురిపెం
ఎన్నికలయ్యాక
ఆ ప్రజలే చేదు కషాయం

చదివిన కొద్దీ
కాకర కీకర అయినట్టు
తెలుగు రాను రాను
టెల్గు అయిపోతోంది

రైల్వే గేటు కింద నుంచి
వెళ్లేవాళ్ళు హీరోలు
రూలుగా ఆగేవాళ్ళు
వెర్రిబాగులోళ్లు

ఎన్ని మోసాలు స్కాములున్నా
ఎన్ని కల్తీలు నకిలీలున్నా
మనందరి ఏకైక స్లోగన్
మేరాభారత్ మహాన్ కదా

వర్షం పడ్డప్పుడే
గొడుగుల గోల
వేసవి వచ్చినప్పుడే
ఇంకుడు గుంతల ఘోష

నాడు పాఠాలు చెప్పేవారికి
బెల్ అండ్ బిల్ ఆఫ్టరాల్
నేడు పాఠాలు చెప్పేవారికి
బెల్ అండ్ బిల్లే ఆల్ ఇన్ ఆల్

ఏమనుకున్నా ఎన్ననుకున్నా
ఎన్నికల్లో
ఏకైక పాత్ర
కులమతాలదే! ◆

---

# కన్నీళ్ళకు కొదవేలేదు...!

- ఎస్.ఎం. సుభాని
9490776184

దుప్పటి చుట్టిన
పార్థివ శరీరాన్ని
భుజాన మోస్తూ
ఒకరు...
పురిటి నొప్పుల
నరక యాతనతో
తల్లడిల్లేను
మరొకరు
జ్వరంతో
మండేదేహాన్నెత్తుకుని
పరుగులెత్తే
మరొక నాన్న తపన
శవమై

ఎదపై వాలిన
చలనం లేని
శరీరం
అప్పుడప్పుడు
ఎలుకలు
చీమలు
పసికందుల పాలిటి
యమపాశాలు...
అందుబాటులో
వైద్యముండదు
అంబులెన్స్ ఎక్కడో?
అంగడి సరుకైన
ఆరోగ్యం



మార్కెట్ శక్తుల
చేతిలో కీలుబొమ్మ...!
ఇప్పుడు
పాడె ఒక్కటే కాదు
బాధను పంచుకునే
పదిమంది జాడలేదు

కన్నీటి అలలు
కట్టలు తెంచుకుంటున్నప్పుడు
ఒంట్లో శక్తి వున్నా
వణుకుతున్న
చేతులు....
ఒక దృశ్యం
కదిలించేది
గుండెను పిండేది
కన్నీరు పెట్టించేది

నిజం...
అయితే... ఏం లాభం
నాగరికత ముసుగులో
కార్చే మొసలి
కన్నీళ్ళకు మాత్రం
కొదవ లేదు...! ◆

# నేల నవ్వింది - ఫక్కున నవ్వుతూనే ఉంది

- పిళ్ళా కుమారస్వామి
9490122229



*పలమనేరు బాలాజీ ఈ నవలను **2008**లో రాసినాడు. ఇది చతుర నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందింది. **2008**లో దీన్ని రాసినా దీని కథాకాలం మాత్రం నాలుగేళ్ళ వెనకటిది. ఆనాటి ప్రభుత్వం కుప్పంలో కొత్త వ్యవసాయ విధానంపై అధ్యయనంలో భాగంగా ప్రయోగాత్మకంగా ఒక ప్రాజెక్టు చేపట్టారు. అదే ఇజ్రాయేల్ తరహా వ్యవసాయం. దాని పర్యవసానాలు ఈనాడు అందరికీ తెలుసు.*

"ఆ మట్టిలో అత్మగతం ఉంది. వర్తమానం ఉంది. భవిష్యత్ కూడా ఉంది. అతడి మూలాలు ఆ మట్టిలోనే ఉన్నాయి. ఆప్యాయంగా ఆ మట్టిని కళ్ళకు అద్దుకున్నాడతను. అయితే, ఆ మట్టి మట్టివాసన వేయటం లేదు. ఏదో వెగటు వాసనవేస్తోంది. నిర్వికారంగా ఆ మట్టివైపే చూస్తుండిపోయాడతను. రెండు కన్నీటిచుక్కలు ఆ గుప్పెడు మట్టిలో నిశ్శబ్దంగా కరిగిపోయాయి".

ఈ ఆఖరు వాక్యాలతో అంతమవుతుంది నవల 'నేల నవ్వింది'. పలమనేరు బాలాజీ ఈ నవలను 2008లో రాసినాడు. ఇది చతుర నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందింది. 2008లో దీన్ని రాసినా దీని కథాకాలం మాత్రం నాలుగేళ్ళ వెనకటిది. ఆనాటి ప్రభుత్వం కుప్పంలో కొత్త వ్యవసాయ విధానంపై అధ్యయనంలో భాగంగా ప్రయోగాత్మకంగా ఒక ప్రాజెక్టు చేపట్టారు. అదే ఇజ్రాయేల్ తరహా వ్యవసాయం. దాని పర్యవసానాలు ఈనాడు అందరికీ తెలుసు.

నవలా రచయిత పలమనేరు బాలాజీ ఏనుగుల రాజ్యం, శూన్యస్వరాలు, నేలనవ్వింది నవలలను రాసినాడు. దాదాపు 50 కథలు, 100 కవితలు, 25 వ్యాసాలు రచించారు. పలమనేరులో ఎం.పి. డి.వోగా పనిచేస్తున్నారు. ఆయన ఈ నవలలో చిత్తూరు మాండలికాలను బాగా వాడినారు. ఇజ్రాయేల్ వ్యవసాయాన్ని కథకు అనుసంధానం చేసి కథను బాగా నడిపారు. ఇప్పుడు ప్రారంభంలో చెప్పిన వాక్యాలు నవల చివరివి. దీనినిబట్టి ఆ నవలా రచన ఎలా సాగిందో మనం అర్థం చేసుకోవచ్చు.

నవల రాసేనాటికి పడమటిగాలులు ప్రపంచీకరణ ప్రారంభమై దాదాపు పదైదు సంవత్సరాలు దాటింది. పడమటి గాలులు ప్రభావం తీవ్రమై రాయలసీమ రైతు తీవ్ర సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్నాడు. దున్నేకొద్దీ దుఃఖం తప్ప ఏమీ మిగలడం లేదు. తన్నుతాను భూమిలో పాతుకుంటున్న ఒక నిస్సహాయ స్థితి. ఐటి గాలులు చల్లగా వీచి, బిటిగాలులు కొత్తగా లేస్తున్న పరిస్థితి. దిగుమతులు విపరీతంగా పెరిగి వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు ధర లేక రైతులు విలవిల్లాడుతున్న విపత్కర పరిస్థితి. సబ్సిడీలు తీసివేయడం సర్వసాధారణమై పోయింది. రైతు రక్షణ విధానం పోయి రైతు భక్షణ విధానం అమలవుతున్న నేపథ్యంలో నవల వచ్చింది. నవలలో మానవసంబంధాలు ఉన్నాయి. ఆర్థిక చిత్రణ ఉంది. పాలకవర్గాల నిర్లజ్జదోపిడీ ఉంది. మొత్తంమీద రాయలసీమ రైతు నిస్సహాయ జీవితం దృశ్యం ఉంది.

మునిక్రిష్ణయ్య దిగువ మధ్యతరగతి రైతు. అంటే సన్నకారు రైతు. ఐదారెకరాల లోపల వున్న వాళ్ళంతా సన్నకారు రైతులే. ఇతనిది మిట్టూరు గ్రామం. ఆ గ్రామంలో ఇద్దరు ధనిక రైతులుంటారు. ఒకరు నరేంద్రరెడ్డి. మరొకరు రామచంద్రారెడ్డి. వీళ్ళు సర్పంచు పదవులకు పోటీ పడుతుంటారు. వీరిలో రామచంద్రారెడ్డికి మునిక్రిష్ణయ్య సన్నిహితుడు.

మునిక్రిష్ణయ్య తల్లిదండ్రులు మరణించారు. తండ్రి ద్వారా ఆరెకరాల పొలం సంక్రమించింది. ఆయనకు లక్ష్మమ్మతో పెళ్ళయింది. వారికి ఇద్దరు కూతుర్లు. ఒక కొడుకు. పెద్దకూతుకు పెళ్ళి చేసేసినాడు. పెళ్లి కోసం రెండెకరాల పొలం అమ్మగా మిగిలిన నాలుగెకరాలపొలంతో ఆయన జీవిస్తున్నాడు. రెండో కూతురు సుశీలకు పెళ్లి చేయాలి. కొడుకు కిషోర్ తిరుపతిలో హాస్టల్లో ఉంటూ డిగ్రీ చదువుతున్నాడు. ఇదీ ఆయన కుటుంబ నేపథ్యం.

రైతు అప్పుల్లో పుట్టి అప్పుల్లో పెరిగి అప్పుల్లో మరణిస్తున్నాడు. చాలామంది ఆర్థికవేత్తలు చెపుతున్నారు.

ఇందుకు మునిక్రిష్ణయ్య మినహాయింపేం కాదు. నవల ప్రారంభమై బ్యాంకుదగ్గిర అప్పుకోసం వచ్చిన మునిక్రిష్ణయ్యతో ప్రారంభమవుతుంది. మేనేజరు అంత సులభంగా అప్పు ఇవ్వడు. రైతులకైతే అసలు ఇవ్వడు. కార్లకు, బస్సులకైతే రుణాలు సులభంగా ఇస్తారు. ఏవేవో పత్రాలు తెమ్మంటారు. అవి తీసుకురావడానికి ఆయనకు తలప్రాణం తోకకు వస్తుంది. అధికారుల చుట్టూ తిరుగుకుంటూ పనులన్నీ మానేసి ఎవర్నో ఒకరిని బతిమాలుకుంటూ మనసులో కుమిలిపోతూ లంచాలు సమర్పించుకుంటూ నలిగిపోతూ ఉంటారు రైతులు. మునిక్రిష్ణయ్య కూడా అంతే. వీటికి డబ్బులు చాలక రామచంద్రారెడ్డి దగ్గర అప్పుడప్పుడూ అప్పులు చేస్తుంటాడు.

**గ్రామాల్లో ధనిక రైతులు తమ భూముల్ని వదులుకోవటం లేదు. భూమి మీద ఆదాయం తగ్గింది కాబట్టి పట్టణాలకు వచ్చి కాంట్రాక్టు పనులు, రియల్ ఎస్టేట్, చిన్న తరహా పరిశ్రమలు, కాలేజీలు లాంటివి పెట్టుకుంటున్నారు.**

గ్రామాల్లో ధనిక రైతులు తమ భూముల్ని వదులుకోవటం లేదు. భూమి మీద ఆదాయం తగ్గింది కాబట్టి పట్టణాలకు వచ్చి కాంట్రాక్టు పనులు, రియల్ ఎస్టేట్, చిన్న తరహా పరిశ్రమలు, కాలేజీలు లాంటివి పెట్టుకుంటున్నారు. భూమిపై పట్టును వదులుకోకుండా గ్రామంపై పెత్తనం సడలిపోకుండా చూసుకుంటున్నారు. రామచంద్రారెడ్డి సర్పంచు ఎన్నికల్లో ఓడిపోయాడు. బెంగుళూరులో ఏదో కాంట్రాక్టు పనులు చేసుకుంటూ వుంటాడు. రామచంద్రారెడ్డితో ఒకసారి కలసినపుడు వాళ్ళ గ్రామం చూపెడుతున్న మునిక్రిష్ణయ్య ఇజ్రాయల ప్రాజెక్టు గురించి చెపుతాడు. ఆ ప్రాజెక్టుపై ఎన్నో నమ్మకాలు. ఎన్నో ఆశలు, మునిక్రిష్ణయ్య మాటల్లో కనిపిస్తాయి.

'మన కష్టమేమి దాంట్లోపెట్టే పనిలేదన్నా. నీదెట్టా బీడుభూములేగదా. మొత్తం ప్రాజెక్టోళ్ళకి లీజు రాసిచ్చేస్తే వాళ్ళే అంతా చూసుకుంటారు. పెద్ద పెద్ద ట్రాక్టర్లు వస్తావుండాయి. మనుషులతో పనిలేకుండా మొత్తం మెషినీలే పనంతా చేసేస్తాయి. కోత కోయడం, ఎరువులు చల్లడం కూడా మెషినీలే చూసుకుంటాయి. మార్కెట్‌కి వాళ్ళే పంటల్ని పంపిస్తారు. గిట్టుబాటు రేట్లు వాళ్ళే మాట్లాడుకుంటారు. మన భూముల్ని మనం వాళ్ళకు అప్పగించేస్తే చాలు. ఎకరానికి సంవత్సరానికి ఇరవై ఇరవైఐదువేలని లీజు చెప్తావుండారు. నువ్వూ నీ భూముల్ని ప్రాజెక్టోళ్ళకి ఇస్తావుండావుగదా!

ఇలా సాగుతుంది మునిక్రిష్ణయ్య సంభాషణ రామచంద్రారెడ్డితో. ప్రాజెక్టు సన్నాహాలు మొదలుతాయి. ఆ వూర్లో, ఎం.ఎల్‌వి, అధికారులు, ప్రాజెక్టు ఆఫీసర్లు వచ్చి వివరాలు రైతులకు చెప్తూ వుంటారు.

ఒకరోజు ఎం.ఎల్.ఏ. పెద్ద సమావేశం పెట్టి ప్రాజెక్టు గురించి విడమరచి ఉపన్యసిస్తాడు. ఇజ్రాయేల్ దేశం మొత్తం ఎడారిదేశం. ఎక్కడా నీటి జాడ ఉండదు. అరవై లక్షల జనాభా ఇరవై మూడువేల చ.కి.మీ. వైశాల్యం కలిగిన ఈ దేశంలో చుక్క నీటిబొట్టూ విలువైనదే. నీటిని ఆదా చేయటంలో కానీ, అత్యాధునిక పద్ధతుల్లో లాభదాయకమైన పంటల్ని పండించి అత్యధిక దిగుబడులు పెంచి సాధించి ఎగుమతులు చేయటంలో కాని వాళ్ళకు మించిన వాళ్ళు ఎవరూ లేరు. ఇప్పుడు ఇజ్రాయేల్ తరహా సాంకేతికతను మీ వూరికి అందిస్తున్నాం. మీరు వారికి మీ భూముల్ని లీజుకివ్వండి. ప్రభుత్వం సంవత్సరానికి లీజుమొత్తాన్ని మీ పొలాన్ని బట్టి నిర్ణయిస్తుంది. మీ పొలాలు సారవంతమవుతాయి. పంటలు విరివిగా పండుతాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని ఇక్కడే ఏర్పాటు చేస్తున్నాము.

ఇలా ఎం.ఎల్.ఏ. చెప్పినాక అధికారులు మరికొంత సమాచారం ఇస్తారు.

“ఇది వందా రెండువందల ఎకరాల్లో చేస్తున్న సమిష్టి వ్యవసాయం. చిన్న కమతాల్లో ఇలాంటి సేద్యం చేయలేరు. పెద్ద వ్యవసాయ క్షేత్రంగా మార్చి డ్రిప్ ఇరిగేషన్లో పైపులు పెట్టి స్ప్రింకర్లతో సేద్యంచేస్తాం. కాలువల ద్వారా నీళ్ళు పంపితే నీళ్ళు భూముల్లో ఇంకిపోతాయి. అలా కాకుండా నీళ్ళు పైపుల్లో పోతాయి. మొక్కలకు కావలసినంత నీళ్ళు అందుతాయి. నీళ్ళను పొదుపుగా వాడుకోవడానికి ఇదేమార్గం”. ఇలా రైతులకు వారి సందేహాలకు ఓపిగ్గా వివరణ ఇస్తారు అధికారులు.

ఊర్లో రైతులంతా తమ భూమిని లీజుకిచ్చేయడం మొదలుపెట్టారు. మునిక్రిష్ణయ్య తన కూతురుకు పెళ్ళి చేయాలి. డబ్బు అవసరం ఉంది. తను సేద్యం చేస్తే హళ్ళికి హళ్ళి సున్నాకు సున్నా. లీజుకిస్తేనైనా ఎకరాకు ఇరవై వేలన్నా ఇస్తే బిడ్డ పెళ్ళి చేయవచ్చని ఆయన ఆశ.

ఎనిమిదేళ్ళ క్రితం అంటే 2009కి ముందు ఆనాడు ప్రభుత్వం డ్రిప్ ఇరిగేషన్ పైపులు ఉచితంగా రైతుకిచ్చింది. దాంట్లో పారిన అవినీతి చూస్తే వ్యవసాయ శాఖలో కూడా డబ్బులు ఎలా దండుకోవచ్చో అందరికీ అర్థమైంది. మేఘమథనం కూడా చేశారు. అదంతా ద్రవ్యమథనమే.

ప్రాజెక్టు పనులు వేగం పుంజుకున్నాయి ఆ వూర్లో. రాతిగుట్టలు కదలిపోయాయి. సర్వేరాళ్లు చెట్లు, మడికట్టలు, సమాధులు మాయమయ్యాయి. వాళ్ళు రెండువందల లోతు

వరకు బోర్లు వేసినారు. దాంతో లీజుకివ్వని రైతుల భూములు ఎండిపోయాయి. పనులన్నీ యంత్రాలే చేస్తున్నాయి. పొలంలో వుండే ఒక చెట్టూ లేదు. గట్టులేదు. అంతా చదునుచేశారు. భూమి సరిహద్దు అప్పుడు ఎవరు చెప్పతారు. వాలుకు అడ్డంగావేసిన కరకట్టలన్నీ కూడా చెరిపేశారు. అంతా డ్రిప్ ఇరిగేషన్ కదా!

**నీకు మట్టి మట్టే**

**నాకు మట్టంతా కవిత్వం** అంటాడు కవి శివారెడ్డి

***అదే రైతైతే నాకు ప్రాణం*** అంటాడు.

మట్టిని నమ్ముకుంటాడు రైతు. అతడు మట్టి మనిషి. మట్టి మీద మమకారం ఉంటుంది. కార్పొరేటు వ్యవసాయం అలా కాదు. మట్టి వారికి రియల్ ఎస్టేట్. మట్టి ఒక బంగారు గని. ఒక సెజ్. కార్పొరేట్ వ్యవసాయం వచ్చాక రైతుల భూములు రైతులవి కావు. రైతులు భూములు లీజుకిచ్చాక ఆ పొలాల్లో ఆ రైతులు కూలీలుగా మారిపోతారు. కార్పొరేట్ వ్యవసాయం ఇజ్రాయల్ ప్రాజెక్టు ద్వారా వెలుగులోకి వచ్చింది. జార్జిబుష్‌ను పిలిచింది అందుకే. మా భూముల్లోకి రండి. పెట్టుబడులు పెట్టండి. మా రైతుల్ని కూలీలు చేయండని కాకపోతే కార్పొరేట్ వ్యవసాయం ఇంకా పని వేగం పుంజుకోలేదు.

మునిక్రిష్ణయ్య భార్య లక్ష్మమ్మ తమ భూములు తమవి కావనే విషయాన్ని గుర్తిస్తుంది. అక్కడ పంటలు తమవి కావనే విషయం ఆచరణలో స్పష్టంగా కనిపిస్తుంది ఆమెకు. బంధువులు వచ్చినప్పుడు వారికిచ్చి పంపడానికి ఇంట్లో ఎలాంటి కూరగాయలు వుండవు.

సంవత్సరం గడుస్తుంది. లీజుడబ్బులు ఇస్తారని ఆశగా ప్రాజెక్టు ఆఫీసు దగ్గరకు చేరుకుంటారు రైతులు. వారితో సర్పంచ్ నారాయణ, సరేంద్రరెడ్డి, మునిక్రిష్ణయ్యలు వెళ్లారు. ప్రాజెక్టు అధికారులు ముందు చెప్పినంత మొత్తం ఇవ్వలేమంటారు. ప్రాజెక్టు ప్రయోగదశలో ఉంది. పైగా భారీయంత్రాలను ఉపయోగిస్తున్నామన్నారు. ఖర్చు పెరిగింది. దిగుబడి ఆశించినంత రాలేదు. గట్టిగా అందరూ కలిసి అడిగితే అగ్రిమెంటు ప్రకారం కంపెనీవాళ్ళు ఎట్లా చెప్తే అలా వినాలన్నారు. కంపెనీ వాళ్ళ ప్రకారం వాళ్ళు ఎంత డబ్బు ఇస్తే అంత తీసుకోవాలన్నారు. అలా ఎకరాలు మూడు వేలు ఇచ్చేస్తారు. మునిక్రిష్ణయ్యకు నాలుగు ఎకరాలకుగాను 12 వేలు వస్తుంది.

క్రిష్ణయ్య తన అప్పులు తీర్చాలా? కూతురు పెళ్ళిచేయాలా? ముష్టి 12 వేలు ఏ మూలకు సరిపోతాయి? ఇదే తరహా విధానం పంజాబ్ లో జరిగింది. పెప్సికంపెనీ టమోటో రైతులతో ఒప్పందం చేసుకుంది. చివరకు చేతులెత్తేసింది. రైతులు లబోదిబో మన్నారు.

వ్యాపారస్తులు చేసే వ్యవసాయంలో మట్టికి విలువలేదు. భూసారం కన్నా భూరక్షణ కన్నా పర్యావరణ పరిరక్షణ కన్నా అధిక దిగుబడులే ముఖ్యం. లాభాలే ముఖ్యం. వ్యక్తిగత లాభాల కోసం సమిష్టి ప్రయోజనాల్ని దెబ్బతీస్తారు. నేలసారాన్ని పెంచకుండా, భూసార వుత్పత్తి, గురించి ఆలోచించకుండా వ్యవసాయం చేస్తారు. రైతు అట్లాకాదు. ఆయన అన్నదాత. మట్టిని నమ్ముకుంటాడు. మట్టిలో పుట్టి మట్టిలో పెరుగుతాడు.... భూసారం దెబ్బతినకుండా చర్యలు తీసుకుంటాడు.

ఇంత జరిగాక విజయవంతమైందని ప్రభుత్వం ప్రకటించింది. కాని ఆచరణలో ఇది విఫలమైంది. దానినే కుప్పం తరహా వ్యవసాయ విధానం అన్నారు. పెట్టుబడులు ఎక్కువ. దిగుబడులు తక్కువ. లాభసాటి వ్యవసాయం కాదని తేల్చినారు.

అప్పులిచ్చిన బ్యాంకులు నోటీసులిచ్చినాయి. మునిక్రిష్ణయ్య తన ఎద్దుల్ని అమ్మేసినాడు. మునిక్రిష్ణయ్య తన భార్యతో ఇలా అంటాడు 'అప్పుతేనోడు ఎవరో చెప్పు. చావులేని ఇంట్లో ఆవాలు తెమ్మని అప్పుడెప్పుడో బుద్ధుడో ఎవురో అడిగినారంట. ఈ కాలంలో అయితే అప్పులేని ఇంట్లో ఆవాలు తెమ్మనంటాడు'.

ఇంతలో కూతురు సుశీల కొచ్చిన సంబంధం మునిక్రిష్ణయ్య ఆర్థికపరిస్థితికి తప్పిపోయింది. తన కొడుకు కిషోర్ తన ఆత్తకూతురు సుజనను ప్రేమించివుంటాడు. వాళ్ళు కూడా కిషోర్‌కు ఏం వుద్యోగం లేదని, వాళ్ళకున్న భూముల్ని నమ్ముకుని తమ పిల్లనివ్వలేమని తేల్చి వేరే పెళ్ళి చేసేశారు తమ కూతురుకి. కిషోర్ ఎం.ఏలో చేరతాడు. హాస్టల్‌లో వుంటాడు.

మునిక్రిష్ణయ్య తన భూముల్ని అమ్మితేగాని కూతురిపెళ్ళి చేయలేనని భావిస్తుంటాడు.

ఇప్పుడు తన భూమి చేతికొస్తుంది. కాని మునుపటిలా లేదు. సారహీనమై ఉంది.

పంట బాగా పండాలంటే మంచి నేలుండాల.... నీటిపారుదల వుండాల్ల. అంతేకదా! బంగారం పండించుకున్న నేలపై చూస్తూంటారు. మట్టి మట్టివాసన వేయకుండా వెగటువాసన వేస్తూంటూంది.

రైతు వ్యధార్థ జీవన చిత్రాన్ని ఆవిష్కరించిన ఈ నవల కొన్ని ఆశలు రేపుతుంది. రైతు ఎలా బతకాలి? నీళ్ళు లేని బీడు భూముల్లో ఎలా తడపాలి? రాయలసీమ రైతు బతికేదెట్లా? ఈ ప్రశ్నలకు మనకు సమాధానం కావాలి. ఇది చాలా ఏళ్ళ నుంచి సామాన్యులను వేధిస్తున్న ప్రశ్న.

# నడిచే అక్షరం



- జానూ సురేష్
9966861565

అమ్మా గౌరీ లంకేశ్
నీ కలం
కోటి గొంతుకల మాటై, పాటై
సమసమాజపు ఊటై
చూపుడువేలు చూపిన బాటై
సిరా సముద్రపు నీలి అలల పోటై
లౌకికవాద ముసుగుతో
మతవాద ఇసుకతో కడుతున్న
కాషాయ కట్టడాలను నేలమట్టం చేసింది

గౌరి లంకేశ్
నువ్వు..
బూటకపు పాలకులపై
తెగబడి తిరగబడిన
పదునైన అక్షరానివి

మనుషుల్ని చంపినంత ఈజీగా
అక్షరాల్ని హత్య చేయలేమని
బహుషా ఆ మూర్ఖులకు
తెలియకపోవచ్చు

అక్షరానికి ప్రాణం ఉంటుంది
కోసం నిలబడే బాధ్యతా ఉంటుంది
తూటాలకంటే అక్షరాలకు శక్తి ఎక్కువని
ఈ దగుల్బాజీలు ఎప్పుడు తెలుసుకుంటారో ఏమో??

ఆమె అక్షరం ...
నడిచే జ్వాలాక్షరం
దగాకోరు పాలకుల నడ్డి విరవడానికి
ధైర్యంగా ఎదురెల్లిన అక్షరం
అక్షరాలు అప్పుడప్పుడు పిడికిళ్ళవుతాయి
ఉద్యమాలవుతాయి
ఉప్పెనలవుతాయి
దేశాన్ని అబ్బ జాగీరుగా భావిస్తున్న
రాజకీయ మతఛాందస రాక్షసులు
తోక ముడిచేలా చేస్తాయి.

*(జర్నలిస్టు గౌరి లంకేశ్ హత్యకు నిరసనగా)*

- ఎండపల్లి భారతి
9652802460



# అన్నం పొద్దు పండుగ

ఉగాది పండక్కి ఊర్లో ఉన్న కుటుంబరాళ్లు అందరూ ఇండ్లు, వాకిండ్లు సున్నం పూసుకొని ఇల్లంతా అలికి ముగ్గులేస్తారు. ఇంగ పండగ నా పొద్దు నాలుగు గంట్ల రేతిరిలోనే లేసి ఎవురి మొగమూ సూడకుండా పూసిన ఇండ్లకు 'పొలి' కడతారు. ఇండ్లలోకి ఆ సంవత్సరమంతా గాళ్ళు దూళ్ళు రాకుండా ఆవు పేడతో ఇంటి సుట్టూ గీత మాదిరి పూస్తారు. దాన్నే పొలి కట్టడం అంటారు.

ఈ పండగని 'పెద్దలపండగ' అంటాము. వాళ్ళ వాళ్ళ ఇండ్లల్లో ముందుగా పెద్దోళ్ళు కానీ చిన్నోళ్లు కానీ సచ్చిపోయింటే వాళ్లకు కొత్త గుడ్డలు తెచ్చి పెడ్తారు. ఆ రోజు సచ్చినోళ్ళకి ఇష్టమైన వంట వార్పు చేసి పెడ్తారు. కుమ్మరింటికి పొయ్యి కొత్త కడవ కొత్త చాట తెస్తాము. ఆ రోజు కొత్త కడవ నిండా నీళ్లు తెచ్చి నట్టింట పెట్టి ఆ కడవ కు నామాలు పెడతాము, మర్రాకు తో కుట్టిన అయిదు ఇస్తరాకులు నట్టింట వేసి చేసిన వంటా వార్పులు అన్నీ అయిదు పల్లేలుగా పెడతాము. తెచ్చిన కొత్త గుడ్లు పెట్టి ఆ నిలుపు పైన చచ్చిన వారి ఫోటోలు ఉంటే పెట్టి మొక్కుతాము.

కొత్త చాటలో పచ్చని ఇస్తరాకు వేసి ఉగాది పండగప్పుడే కాసే యాపాకు, యాపూత అంతా తీడి చాటకు పోసి దాంట్లో ముద్ద బెల్లం నున్నగా కొట్టి బాగా కలిపి దేవుని ముందర పెడతాము. అన్నం పొద్దుకు అంటే తెల్లారి తొమ్మిది గంటల లోపే దేవునికి టెంకాయ కొట్టాల. అందుకే పెద్దోల్లు ఈ పండగను 'అన్నంపొద్దు పండగ' అని కూడా అంటారు. నట్టింట పెట్టిన అయుదు పల్లేలులో దేవునికి ఒకటి, నిలుపుకొకటి, ఇంటికప్పుపైన ఒకటి, గోగికొకటి,అందరూ తినే దానికొకటి పెట్టి, చాట లోని యాపాకు బెల్లంని ఊర్లో ఒకిల్లు వదలకుండా ఇంటింటికీ పంచుతాము. మగం నిష్టూరాలు ఉండకూడదని, గడపతొక్కని ఇరోదస్తుల ఇంటికి కూడా పోయి ఆ రోజు యాపాకు బెల్లం పంచుతారు. పెద్దోళ్లకు పట్టింపులుంటాయని పిల్లోళ్లను పంపిస్తారు పంచేదానికి. అది కూడా మధ్యాహ్నం 12 గంట్ల లోనే పంచల్ల. అందుకే ఆ పొద్దు ఆడోళ్ళ ఉసురు పోతుంది. ఎవరన్న ముందుగా పంచిరంటే ఇగ ఊపిరాడదు. వాళ్ళు పంచేసిరే మేము ఎబుడు పంచేది అని షరత్తు పుడుతుంది. ఇండ్లల్లో మగోళ్ళు అరస్తా

ఉంటారు ఇంకా కాలేదా అని. మాకు భయమేసేది ఎవరు ముందుగా యాపాకు తెస్తారా అని. ఈ పండుగ వచ్చిందంటే ఊరు సేరు పొందదు.



పండుగ రోజు మా తమ్ముని కూతురు పన్నెండు గంటలకు యాపాకు ఎత్తుకొని వచ్చి మా ఇంట్లో ఏసేసి పాయె! ఊర్లో అందరూ చేసినవన్నీ తిని వీధుల్లోకి వచ్చినారు. అమ్మలక్కలు ముందు ఎవరు యాపాకు పంచింది, యనకాల ఎవరు యాపాకు పంచింది అని మాట్లాడుకుంటుండ్రి.

ఆ యాలకు నేను పోతి. ఈ సారి మారక్క కూతురు అందరి కంటే ఎనకాల యాపాకు ఎత్తుకొచ్చింది. అంత పొద్దు దాకా ఆ యమ్మ ఏంచేస్తా ఉన్నింది అంటా ఉండారు అమ్మలక్కలు. ఎందుకు అంత ఆలస్యం చేసినారు మా తమ్ముడోల్లు... వాడి పెళ్ళాన్ని నాలుగు తిట్టాల అని వాళ్ళింటికి పోతి.

వాని పెళ్ళాము గోడకి ఒరుక్కోని ఉంది, నా తమ్ముడే బిడ్లకు నీళ్లు పోసి దేవునికి అన్నీ సరి చేసి టెంకాయ కొట్టినాడు. వానికి ఇద్దరు కూతుర్లు. చిన్నది నాకు కొత్త గౌను ఎయ్యి అని ఉట్టి పైయి తోనే ఏడస్తా ఉంది. పెద్దది యాపాకు పంచి వచ్చి అన్నం తింటా ఉంది. వాళ్ళమ్మ మూతి మూరడు పొడవు పెట్టుకుని కూసోనుంది. నేను పొయ్యి యాలండ్రా పండగ పూట అట్లుండారు అంటి. మా తమ్ముడుండి "చూడక్కా, నాయనకు గుడ్డలు తెచ్చినా, వాళ్ళమ్మకు గుడ్డలు తేలేదని అలిగింది" అనే. నాయన బతికిన్నబుడు ఎఱ్ఱ సెరాయి ఒకటి తేరా తేరా అని మా తమ్ముణ్ణి అడిగి అడిగి సచ్చిపోయే. సచ్చినంక బలే అక్కరగా తెచ్చి పెడతా ఉండాడు, సచ్చినోళ్ళు వచ్చి కడతారా వాల్ల పేరుబెట్టి వీళ్ళు కట్టుకునే దానికే కదా అని లోపల అనుకోని బయటికి వాళ్ళని మందలించి వస్తిని.

ఇంతలో మా ఆడబిడ్డ ఊరినుంచి వచ్చే! వాళ్ళమ్మ వొలిక్కాడికి (సమాధి) పొయ్యి చీరపెట్టి టెంకాయ కొట్టి వాట్ని ఎత్తుకోని వచ్చింది. "వొదినా చూడు మా యమ్మకు ఎయ్యి రూపాయలు పెట్టి చీర తెచ్చినా బాగుందా" అనే ! "బాగానే ఉంది కాని పాపా అమ్మ బతికినబుడు కూలీ నాలీ చేసి రూకార్డుగా (అంతో ఇంతో)ఎత్తి పెట్టుకున్న డబ్బులతో కొత్త చీర తెచ్చుకుంటే ఆ యమ్మను ముడ్డి మింద కూడా పెట్టనిచ్చే దానివి కాదు. మొండికేసి నువ్వే కట్టుకునే దానివి. బతికినబడు రైగ్గుడ్డ అట్లాడిది కూడా పెట్లే, ఇపుడు ఎయ్యి రూపాయల చీర తెస్తివే" అంటి. దాని మొగం చిన్నదైపోయె ! నేను అంతే, మొగాన్నే అడిగేస్తా! అట్లాంటిది కాక పోతే వాళ్ళమ్మ కాయిలాకు (జబ్బు) వొంగింది. కూతురు కదా అని ఆ యమ్మకు ఇష్టమయిన పోలీలు చేసి పెట్టమ్మ అని అడిగింది. అది గాన చేసింటే మనిషి కాదు. ఇబుదు పోలీలు, అత్తరసాలు, వక్కాకు, సారాయి అన్నీ తీసుకొచ్చి వొలిక్కాడ పెడితే ఆ యమ్మ తింటుందా తాగుతుందా. ఈ బాద బతికినపుడు పడేది. అబుడు పెడితే ఇంకా రొన్నాళ్ళు బతికితే ఎట్లా అనుకుంటారు.

ఉగాది పండగ నా పొద్దే అందరికీ చచ్చినోళ్ళు గ్యాపానికి వచ్చేది. అంతకుముందు వాళ్ళని ఏసిన తావన అడవై పోయుంటుంది. పండగనాపొద్దు పొయ్యి వొలికలను తారాడుకొని కాళ్ళు ఏపక్క తల ఏపక్క అని ఉరువు కూడా తెలియక అట్లే కొబ్బరికాయ కొట్టి పూజ చేసుకొని ఇంటికొస్తారు. ఆ పొద్దు పొగిడే వాళ్ళు ఇండ్ల ముందరకు వస్తే ధాన్యం, డబ్బులు ఇచ్చి వాళ్ళతో సచ్చినోల్లను పొగిడిస్తారు.

ఆలుమగలు ఇద్దరు పొగిడేవాళ్లు మా ఇంటి ముందరకు వస్తే నేను కూడా చాటెడు బియ్యం పోసి మా యమ్మను పొగిడిస్తి. వాళ్ళు గుమ్మటి కొడతా మాయమ్మ గురించి పాడతా ఉంటే నా కంట్లో నీళ్లొచ్చే !

*"నీ కూతురుండబట్టి ఏ మిచ్చి పగడిచ్చే !*
*ఎండి రూకాలిచ్చి ఎచ్చుగా పగడిచ్చే !*
*రాగి రూకాలిచ్చి రచ్చాన పగడిచ్చే !*
*వస్త్రా దాన మిచ్చి వయికుంటమే పంపే !*
*ఏ దేవుడు నిను కోరినమ్మ మా రాజు ఎల్లమ్మ !*
*దేవలోకం చేరినావా, దేవుడై నిను కాపాడునమ్మా !*
*ఇల్లలికి ముగ్గు బెట్టి ఇంటా మల్లెలు జల్లి పిలిసినా రావంట !*
*తలిసినా రావంట, పండగన రావంట, పబ్బాన రావంటా!*
*ఏమీ రాత రాసెనమ్మా దేవుడు అర్దా రాత రాసెనమ్మా!*
*ఇల్లూ వాకిలి ఇడిసి, పిల్లా పెద్దల నిడిసి దేవలోకం చేరినావా*

# మనసు లెక్కడున్నాయి చెప్పండి!

- రావి రంగారావు
9247581825



చంద్రమండలం దాటి
దూసుకుపోతున్నాం గాని
ఇరుగుపొరుగు వారి గుండెల్లోంచి జారిపడుతున్నాం...
విశాల గృహాలు
పెద్దపెద్దవి కట్టుకుంటున్నాం గాని
పెద్దల్ని మన చేతల్లోంచి జారవిడుచుకుంటున్నాం...
మేధ, తెలివితేటలు
ఆకాశం మించేలా పెంచుకుంటున్నాం గాని
హృదయం పాతాళంలోకి పారేసుకుంటున్నాం....
అంతర్జాలంలో అనుక్షణం
అగణిత మిత్ర సమూహాలతో కలుసుకోగలుగుతున్నాం గాని
ఆపదలో ఆసరా నిలబెట్టుకోలేకపోతున్నాం....
ఎక్కడ బడితే అక్కడ
సమయం తెలిపే యంత్రాలు అమర్చుకుంటున్నాం గాని
సమయం విలువను హీనంగా దిగజార్చుకుంటున్నాం...
వేలాది కొత్త ఔషధాలు
విచ్చలవిడిగా కనిపెట్టగలుగుతున్నాం గాని
లక్షలాది కొత్తకొత్త రోగాల్ని
కావాలని 'కొని' తెచ్చుకుంటున్నాం...
అనంతంగా రోజు రోజుకు
ఆదాయం పెంచుకోగలుగుతున్నాం గాని
ఆవగింజంత మనశ్శాంతి నిలుపుకోలేకపోతున్నాం...

అందంగా బతుకుతున్నాం గాని
ఆనందంగా జీవించలేకపోతున్నాం
మనుషుల మనుకుంటున్నాం గాని
మనసు లెక్కడున్నాయి చెప్పండి!

---

# ఘోర పాపమే

- షా. ఇబ్రహీం
9533336227



అవును
మతమౌఢ్య మారణకాండ చిచ్చులో
మానవత్వం మంటగలిసింది
ముస్లిం రోహింగ్యాలా
భీకర ఆర్తనాదాలు అబౌద్ధ మృగాల
కనుసైగల్లో
దేహాలు తెగబడుతూ తగలబడుతూ
జంతువుల చర్మం వొలిసినంత
సులువుగా మనుషుల చర్మాలను ఒలచడం
తవ్విన గుంతలో మనుషులను
విసిరి నిప్పంటించడం
బిక్కు బిక్కుమంటూ ప్రాణాలు
అరచేతుల్లో పెట్టుకుని
దేశాన్ని వదిలి పారిపోతున్న
శరణార్థులను
క్రూరాతి క్రూరంగా వేటాడి చంపడం
పసికందులను సైతం కర్కోటకంగా
కాళ్లతో
గొంతు నులిమి చంపడమంటే
మానవత్వం బ్రతికుందనా అర్థం?
మంచితనానికి మించిన
మానవత్వం లేని
మతమేదైనా సంస్కరణ
జరిగితీరాల్సిందే
జీవహింస మహాపాపమని
చెప్పినవారే
మానవహత్యలకు పాల్పడడమంటే
పిల్లతల్లి పిల్లకు పాలివ్వడం కూడా
ఘోర పాపమేనా!
మనుషుల మధ్య ముళ్ళకంచెలు
మనుషులు సృష్టించిన మతాల
నడుమ ముళ్ళకంచెలు
ముళ్ళ కంచెలను చెరిపి మనిషిని
గుర్తిస్తే గానీ
ఈ సువిశాల భూప్రపంచంలో
మానవజాతి మానవీయజాతి
కాజాలదు



# మధ్యతరగతి వేదనలు వేంపల్లి సికిందర్ కథలు

- డా॥ వి.ఆర్. రాసాని
9848443610

*ఈ కథల్లో చిత్తూరు ప్రాంతపు మధ్యతరగతి జీవితాల చిత్రణ, సంస్కృతి, సంప్రదాయాల నేపథ్యం కలిగి వుంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే రాయలసీమ మధ్యతరగతి వేదనలను వేలార్చిన వేంపల్లి కథలివి. మంచి శిల్పనైపుణ్యంతో, సరళంగా సాగిపోయే శైలితో నిర్మించిన ఈ కథలు వాశిలో మెచ్చుకోదగ్గ స్థాయిలోనూ వుంటాయనడంలో సందేహం లేదు.*

"ఈనాటి కథ ప్రజల ఆశలూ, ఆకాంక్షలూ జీవితాల్లో కదలాడే వైరుధ్యాల, వాటి బింబప్రతిబింబాల్ని నిజాయితీగా ఎత్తి చూపగలుగుతూ వుంది. సమాజంలో మనిషి, ఎదుర్కొనే సవాళ్ళను సమర్థవంతంగా ఎదుర్కోవడమే కాకుండా, మనిషి పోరాట పటిమను పెంపొందించేందుకు అనువైన ఆయుధాలను సమకూరుస్తూ లక్ష్యసాధన దిశగా అడుగులేయిస్తూ వుంది" (అమ్మచీర – నామాట)

నిజమే – కథా ప్రయోజనాన్నీ, నేటి కథ నడుస్తున్న దిశను ఇంత చక్కగా వ్యక్తం చేసిన రచయిత వేంపల్లి సికిందర్. ఆయన కథలు రాశిలో చిన్నవే కావచ్చు. కానీ వాసిలో చెప్పుకోదగ్గవే. వేంపల్లి సికిందర్‌ది చిత్తూరు జిల్లాలోని మదనపల్లికి సమీపంలో వున్న కురబలకోట గ్రామం. అతనొక పేద దూదేకుల కుటుంబంలో పుట్టిన వాడు గనుక అనేక కష్టాలను ఎదుర్కొని, అతికష్టం మీద స్వశక్తితో చదువుకొని, 1983లో తిరుపతి, తిరుమల దేవస్థానంలో జూనియర్ అసిస్టెంట్‌గా చేరి 2011లో అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా ఉద్యోగ విరమణ గావించారు. ఆయన ఉద్యోగంలో చేరకముందు చిత్తూరు నుంచీ 'తెలుగుతేట' అన్న వారపత్రికను 7 సంవత్సరాలు నడిపారు. ఆ సమయంలోనే ఆ జిల్లాలో ప్రసిద్ధులైన పి. రాజగోపాలనాయుడు, కె. సభా, మధురాంతకం రాజారాం, పులికంటి కృష్ణారెడ్డి, సి.వేణు, కలువకొలను సదానంద, ముంగర శంకరరాజులాంటి సాహిత్యవేత్తలతో మైత్రీబంధం ఏర్పాటుచేసుకుని మంచి జర్నలిస్టుగా, మంచి కవిగా, కథకుడిగా, నాటక రచయితగా పేరు తెచ్చుకున్నారు. కె. సభా, పులికంటి వంటి వారి ప్రోత్సాహంతో మంచి కథకుడిగా కూడా పేరు తెచ్చుకున్నారు. వారు ముద్రించిన కథల సంపుటి 'అమ్మచీర'.

ఈ 'అమ్మచీర' కథల సంపుటిలో మొత్తం పదమూడు కథలున్నాయి. వాటి పేర్లు అమ్మచీర, ఆప్తహస్తం, వృక్షోరక్షతి రక్షితః, శ్రమజీవన మాధురి, గులాబిగోళ్లు, ఎండుకొమ్మల నీడ, వెలుగులోకి, బాధ్యతా పరిమళాలు, నీలిమబ్బులు, వాలెన్‌టీన్స్, ప్రవాహంలో నాచు, పనికొచ్చే చదువు, ఋతుశోష. ఈ కథల్లో చిత్తూరు ప్రాంతపు మధ్యతరగతి జీవితాల చిత్రణ, సంస్కృతి, సంప్రదాయాల నేపథ్యం కలిగి వుంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే రాయలసీమ మధ్యతరగతి వేదనలను వేలార్చిన వేంపల్లి కథలివి. మంచి శిల్పనైపుణ్యంతో, సరళంగా సాగిపోయే శైలితో నిర్మించిన ఈ కథలు వాశిలో మెచ్చుకోదగ్గ స్థాయిలోనూ వుంటాయనడంలో సందేహం లేదు.

మనది ప్రపంచం మెచ్చిన ప్రజాస్వామ్యం అంటారు. పైకి గొప్పగా చెప్పుకుంటున్న ఈ రాజ్యవ్యవస్థలో అధికారం కోసం ఆరాటపడే రాజకీయ నాయకుల ఓట్ల ఆకర్షణ

పథకాలలోనూ, స్వార్థ రాజకీయాల కుట్రలు కుతంత్రాలతోనూ రోజురోజుకీ రోగిష్టి దానిలా మారిపోతోంది. చాపకింద నీరులా పైకి కనిపించకుండా ప్రమాదభరితంగా ప్రాకుతున్న మతోన్మాదం తలకెక్కిన మతమృగాలు పెచ్చుపెరిగిపోతున్నాయి. ఈ నేపథ్యంలో ఈ దేశంలో 40 శాతం దాకా వున్న ముస్లింలు అభద్రతా భావంతో జీవిస్తున్నారు. పైపెచ్చు కడుపేదరికంతో ఎక్కువమంది అల్లాడిపోతున్నారు. అయినా ఈ భారతీయ సమాజంలో సహసామాజికులతో సహజీవనం గడుపుతున్నారు. వీటన్నింటినీ అర్థం చేసుకుని రచనలు చేస్తున్నారు సికిందరు. అందుకే వారి కలం ముస్లింల జీవిత కోణాలనే గాక హిందూ కుటుంబాల వైనాన్నీ చిత్రించడానికి ప్రయత్నించింది.

**ముస్లింలు అభద్రతా భావంతో జీవిస్తున్నారు. పైపెచ్చు కడుపేదరికంతో ఎక్కువమంది అల్లాడిపోతున్నారు. అయినా ఈ భారతీయ సమాజంలో సహసామాజికులతో సహజీవనం గడుపుతున్నారు.**

అమ్మచీర కథల సంపుటిలో ముస్లిం జీవితాలను, వారి బాధలను చిత్రించిన కథలు రెండు. అవి శ్రమజీవన మాధురి, ప్రవాహంలో నాచు.

భావుకులు ప్రకృతిలో సౌందర్యాన్ని చూసి ఆరాధిస్తారు. కొందరు నగరాలలోని ఆకాశ హర్మ్యాల అంతఃసౌందర్యాల్ని చూసి ముగ్ధులవుతారు. మరికొందరు స్త్రీల అందాలను ఆస్వాదిస్తారు. కానీ చెమటోడ్చి కష్టించే కష్టజీవుల శ్రమలో సౌందర్యాన్ని దర్శించే వాళ్ళు కూడా వుంటారు. నిత్య శ్రమైక జీవులైన సామాన్యుల సహజ జీవితంలో మాధుర్యాన్ని దర్శించే వారు అరుదు. అలాంటి అరుదైన అంశాన్ని తీసుకుని రాసిన కథ 'శ్రమ జీవన మాధురి'. ఇదొక దిగువ మధ్యతరగతి జీవనాన్ని గడిపే ఒక ముస్లిం కుటుంబ శ్రమజీవనాన్ని చిత్రించిన కథ.

"భారతీయ ముస్లింల పట్ల, భారతీయ సమాజంలో నిష్కారణమైన భయం, ద్వేషం, ఈర్ష్య పుట్టుకొస్తున్న తీరు తెన్నులు తెలిసి, నిరపరాధులయిన, ముస్లిం కుటుంబాల పట్ల గౌరవభావం, ప్రేమ" వంటి వాటిని కలిగించాల్సిన అవసరాన్ని తెలియజేయడం ఈ కథ యొక్క ప్రధాన లక్ష్యం.

రామం, రంగనాయకులు, జోష్యులు ఒక ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగస్తులు. జోష్యులు సూపరింటెండెంటు అయితే, మిగిలినవారు క్లర్కులు. అక్కడే జమేదారుగా పని చేసేవాడు ఖాదర్‌బాయి. ఆ రోజు ఆఫీసులో మిత్రులు ముగ్గురూ తమ కుటుంబ పరిస్థితుల పైన చర్చ సాగిస్తుంటారు. ఒకతనికి ఉద్యోగం చేసే కుమారుడుంటాడు. మిగిలిన ఇద్దరికీ నిరుద్యోగ యువకులయిన కుమారులంటారు. అందులో ఒకరి అబ్బాయి ఇంజనీరింగు చేసి నిరుద్యోగిగా తిరుగుతున్నాడు. మరొకరి కుమారుడూ నిరుద్యోగి. అందుకే "గొప్పలకు పోకుండా ఏ ఐటిఐ లోనో, పాలిటెక్నిక్‌లోనో వృత్తివిద్య చెప్పించి వున్నా, టెన్త్ మెరిట్ మార్కుల ఆధారంగా బస్సు కండక్టర్ ఉద్యోగం వేయించుకొని ఉన్నా... లేదూ చివరకు ఏ కార్పెంటరీలోనో బేల్దారీగానో పని నేర్పించి వున్నా" వారు సంపాదించేవారనీ, బి.ఇలు, ఎం.ఇలు చేసి కూడా ఇప్పటిలాగే బేకారిగా తిరిగే వాళ్ళు కాదనీ చర్చించుకుంటూ వుంటారు. ఒకతను తనను మాయింట్లో వాలంటరీ రిటైర్మెంటివ్వమంటున్నారనీ, ఆ డబ్బుల్తో ఇంజినీరింగ్ చేసి నిరుద్యోగిగా వున్న అతని కొడుక్కి ఉద్యోగం వచ్చేట్లు చేయడమే గాకుండా రిటైర్మెంటప్పుడు వచ్చే డబ్బుల్తో వ్యాపారం పెట్టించేటట్లు చేయాలని ఒకటే వత్తిడి చేస్తున్నారనీ చెప్పుకుని బాధపడతాడు. కాని జమేదారుగా వున్న ఖాదర్‌బాయి మంచి బట్టలు వేసుకుని, ఎప్పుడూ కిళ్ళీ నములుతూ దర్జాగా వుండడం చూసి ఈర్ష్యపడుతుంటారు. ఒక సందర్భంలో ఆ ఈర్ష్యను వెళ్లగక్కుతూ "చట్టవ్యతిరేక కార్యకలాపాలకో, మతం మత్తులో దేశద్రోహానికో... ఏదో ఒక తప్పుడు మార్గాన్ని ఎంచుకుని మస్తు పైసలు సంపాదిస్తున్నట్లు తోస్తుంది మాకు" (అమ్మచీర. పు.29) అంటారు. అది భరించలేని ఖాదర్ ఆ ముగ్గురిని తన యింటికి భోజనానికి పిలుస్తాడు. ఆ మరునాడు అతని యింటికి వెళ్ళిన ఆ ముగ్గురికి తన సొంత ఇంటిలో కుటీర పరిశ్రమ అయిన ప్లాస్టిక్ వైర్లతో బ్యాగులల్లుతున్న అతని కూతుర్లు, పై అంతస్తులో ఖురాన్ పాఠాలు చెబుతూ, పారశీక భాషలోని తప్పుల్ని దిద్దుతూ శిష్యులలో, కొందరి ముస్లిం పిల్లలకు ట్యూషన్ చెబుతూ, పూలమాలలు తయారుచేస్తూ అతని భార్య కనిపిస్తారు. మగపిల్లల గురించి "సిఫార్సులు లేకపోయె. రిజర్వేషన్లు నై. మా శ్రమను నమ్ముకోవాలె. మాది పెద్దవాడు మహ్మద్ ఆటో నడుపుకుంటాడ్. దూస్రా అహ్మద్ కిళ్ళీ దుకాన్, తీస్రా ఉస్మాన్ ఐ.టి.ఐ. చేసి ఎలక్ట్రీసియన్, హైసాబ్. నాల్గోవాడు జమీర్ 10 తరగతి చద్వి కంప్యూటర్ చేశాడ్. వాడు తాజా ఖబర్, అదే పేపర్ల పని డి.టి.పి. చలతా

సాబ్..” అని చెబుతాడు. అలా ఆడపిల్ల చేసిన కుట్లు, అల్లిక, ఎంబ్రాయిడరీ పనుల వల్ల బీబీ అల్లే పూలమాలల వల్లా, ట్యూషన్ వల్లా ఎవరివంతు వారు సంపాదించి, ఉన్నదాంతో సంతృప్తి చెందుతున్నామని చెబుతాడు. వారి శ్రమ జీవనంలోని సౌందర్యాన్ని, మాధుర్యాన్ని చూసి ఆ ఉద్యోగస్తులు ఆ యింటి బిరియానీలు తిని అప్పట్నుంచీ అతన్ని గౌరవిస్తారు.

**అదొక పెద్ద ప్రవాహంలా కొనసాగిపోతుంటే ఏమీ తెలీని ఆడపిల్లలు నాచులా అందులో కొట్టుకుపోతున్నారనీ ప్రతీకాత్మకంగా, ఎంతో ఆలోచనాత్మకంగా కథ ముగుస్తుంది.**

హైదరాబాదు పాతబస్తీలోని పేద ముస్లింలు, డబ్బుకు ఎలా వారి గొంతుకోస్తున్నారో ఈ మధ్య టీ.వీ.ల్లో చూసి, పేపర్లలో చదువుతున్నాం. ఈ అంశంపైన 'ప్రవాహంలో నాచు' అన్న పేరుతో సికిందర్ ఎప్పుడో ఒక కథ రాశారు.

ఒక పేద ముస్లిం వ్యక్తి ఖాదర్ భాషా. అతని కూతురు సల్మా. పదో తరగతి చదువుతుంటుంది. తండ్రి తాగుబోతు. కుటుంబం గురించి అస్సలు పట్టించుకోడు. సల్మా తల్లే పాచి పనులు చేసి కుటుంబాన్ని నెట్టుకొస్తుంటుంది. ఆ కుటుంబ పోషణకోసం సల్మా కూడా ఒక యింట్లో తెల్లవారే లేచి పనులు చేసి వచ్చి, స్కూలుకు పోతుంటుంది. ఆ యింటి యజమానురాలు కరుణలేని కఠినాత్మురాలు. ఆమె పెట్టే బాధల్ని మౌనంగా భరిస్తూనే, పనులు చేసుకుంటూ ఆలస్యంగా స్కూలుకు వెళుతుంటుంది. ఆ రోజు లేటుగా స్కూలుకు వెళ్ళినందుకు పీఈటీ అనిత సల్మానును రెండు దెబ్బలు కొట్టి, మోకాళ్ళపైన నిలబడే శిక్ష వేస్తుంది. కానీ హెచ్.ఎం. లావణ్యకు స్కూలు పిల్లలంటే ప్రేమ ఎక్కువ. ఆ కారణంగా వాళ్ళ బాగోగుల్ని కూడా విచారిస్తుంటుంది. రోజూ దిగాలుగా స్కూలు కొస్తున్న సల్మా ఒకరోజు రాత్రి అయినా యింటికి వెళ్ళక స్కూల్లోనే వుండిపోతే లావణ్య సల్మాను పిలిచి 'ఏమైందే నీకు. ఎందుకలా వున్నావు?' అని అడుగుతుంది. సల్మా అతికష్టంమీద 'మా వాళ్ళు దుబాయిషేక్‌కు ఇచ్చి 'నిఖా' జరిపించాలని అనుకుంటున్నారు మేడమ్' అని చెప్పి ఏడుస్తుంది. ఆ మాటతో మనసు కరగిపోయిన లావణ్య వాళ్ళ నాన్నను పిలిపించి 'బాగా చదివే పిల్లను దుబాయ్ షేక్‌కిచ్చి పెండ్లి చేయడం తప్పు. టెన్త్ పాసయ్యేదాకా నా యింట్లోనే పెట్టుకుంటాను పో' అంటుంది. అతను అలాగే అని వెళ్ళిపోతాడు. లావణ్య, అనితలు దుబాయ్ షేక్‌ల పెళ్ళి పేరుతో అమ్మాయిల్ని తీసుకెళ్ళి, వాళ్ళను వ్యభిచారంలోకి దించి, హింసిస్తుంటారని మాట్లాడుకుంటారు. ఆ మోసానికి సల్మా బలికాకుండా చూడాలనుకుంటారు. అయితే కొన్ని రోజుల తర్వాత ఇంటికి వెళ్ళి వస్తానని వెళ్ళిన సల్మా తిరిగిరాదు. స్కూలుకూ రాదు. ఏమైందో లావణ్యకు తెలీదు. ఆ తర్వాత అనిత 'ఖాదర్ అనుకున్నది చేశాడు. సల్మాను షేక్‌కే యిచ్చి పెళ్ళి చేయడానికి అమ్మాయిని తీసుకుని హైదరాబాదుకు పోయాడనీ, ఆ వీధిలో వాళ్ళు చెప్పారనీ' చెబుతుంది. ఏమీ చేయలేని నిస్సహాయురాలైపోతుంది లావణ్య. ఈ షేక్‌ల దురాగతం చాపకింద నీరులా నిరాఘాటంగా సాగిపోతోందని మధనపడుతుంది. ఆ స్కూలు పక్కనే వర్షంపడి వంక సాగిన నీటిలో కొట్టుకుపోతున్న నాచును చూస్తుండిపోతుంది. అంటే తల్లిదండ్రులే తమ బిడ్డల్ని డబ్బులకాశపడి షేక్‌లకు అమ్మేసుకోవడమనే దుర్మార్గం ఎవ్వరూ ఆపలేని స్థాయిలో వుందని, అదొక పెద్ద ప్రవాహంలా కొనసాగిపోతుంటే ఏమీ తెలీని ఆడపిల్లలు నాచులా అందులో కొట్టుకుపోతున్నారనీ ప్రతీకాత్మకంగా, ఎంతో ఆలోచనాత్మకంగా కథ ముగుస్తుంది.

వ్యవసాయాధారిత కుటుంబాలయిన రైతుల జీవితాల నేపథ్యంతో రాసిన కథలు ఆప్తహస్తం, ఎండు కొమ్మల నీడ.

ప్రసాద్; రమణలు చిన్ననాటి స్నేహితులు. రమణ మోతుబరి రైతు. నేలను నమ్ముకున్న వాడు. ప్రసాద్ పేదవాడైనా ఇంటర్ వరకు బాగా చదువుకొని గ్రూప్ ఫోర్ పాసై ఆర్.డి.ఓ ఆఫీసులో గుమాస్తాగా చేరి బాగా స్థిరపడ్డాడు. అయితే చాలా ఏళ్ళ తర్వాత గెడ్డం పెంచుకుని దీనావస్థలో మిత్రున్ని కలిశాడు రమణ. ఏళ్ళ తరబడి వర్షాలు రాక, భూములు బీళ్ళు పడితే, ఆ భూముల్లో లక్షలు పెట్టి బోర్లు వేయించి అప్పుల పాలై, కుటుంబ పోషణ కవసరమైన సాయం అడగాలని రమణ తన దగ్గరికి వచ్చాడని తెలుసుకుంటాడు ప్రసాద్. అయితే తను టెన్త్ ఫెయిలయినప్పుడు జ్యోతిష్యం చెప్పి, పది పాసవుతానని ధైర్యం చెప్పిన రత్నం మేష్టారు దగ్గరకు రమణను తీసుకు వెళ్ళి మిత్రుడికి జ్యోతిష్యం చెప్పమని అడుగుతాడు ప్రసాద్. మేష్టారు ప్రసాద్‌ను పక్కకు తీసుకెళ్ళి నాకు జ్యోతిష్యం రాదని, ఫెయిలయిన నీకు ధైర్యం కలగడానికి ఆ రోజు అలా చెప్పానని చెబుతాడు. ఆ తర్వాత బాగా ఆలోచించి ప్రసాద్ మేష్టారు కూడా నీ భవిష్యత్ బాగుపడుతుందని చెప్పాడని అబద్ధం చెప్పి 50,000 రూపాయలు సాయం చేసి రమణను ఆదుకుంటాడు. ఆపదలో వున్న మిత్రున్ని ఆదుకోవడమే

నిజమైన ఆప్తహస్తం అని ఈ కథ ద్వారా సికిందర్ చెబుతారు. అయితే ఈ కథలో సీమలోని రైతు బాధల్ని కళ్ళకు కట్టినట్టు చెప్పడం కూడా ఫలవంతంగా చెప్పడం జరిగింది.

**కరువు, మానవ సంబంధాలను, రైతు బిడ్డలకుండే ఆత్మాభిమానాల్ని, గురించి రాసిన కథలు అరుదు. అలాంటి అరుదయిన కథల్లో 'ఎండ కొమ్మల నీడ' ఒకటి.**

రాయలసీమ రైతు జీవితాలను శాసించేది కరువు. కరువు, మానవ సంబంధాలను, రైతు బిడ్డలకుండే ఆత్మాభిమానాల్ని, గురించి రాసిన కథలు అరుదు. అలాంటి అరుదయిన కథల్లో 'ఎండ కొమ్మల నీడ' ఒకటి. ఈ శీర్షికే చాలా లోతైన అర్థాన్నిచ్చేది. ఎండిన చెట్టు కరువుకు ప్రతీక. పచ్చని చెట్టు నీడ చల్లదనాన్నిస్తుంది గానీ, ఎండిన చెట్టు నీడ నీడా కాదు, దాన్ని నమ్ముకున్న బతుకు బతుకూ కాదు. అలాగే ఆత్మాభిమానాన్ని చంపుకుని అల్ప బతుకులను ఆడించడం కూడా ఎండిన కొమ్మల నీడ వంటిదే. తిరుపతి నివాసి అయిన రచయిత, ఆతని శ్రీమతి రైల్వేస్టేషన్ ప్రక్కింటి వస్తుంటే యవ్వనంలో వున్న ఒక అమ్మాయి చిరిగిన చీరతో మాసిన జుట్టుతో అడుక్కుంటున్న దృశ్యం చూస్తారు. రచయిత శ్రీమతి అతన్ని అక్కడే వుండమని ఇంటికి వెళ్ళి ఒక విలువైన పాత చీరను, జాకెట్టును తెచ్చి ఆ యవ్వనవతికి ఇవ్వబోతే 'అంత పెద్ద దానాన్ని తాను గ్రహించననీ' నిరాకరిస్తుంది. ఆ తర్వాత కొద్ది రోజులకు రచయిత దంపతులు యూనివర్సిటీ క్యాంపస్‌లో వాకింగ్ చేస్తుంటే లైబ్రరీ ముందరున్న రేకుల షెడ్డు దగ్గనుంచి ఆ అమ్మాయి వారి దగ్గరకు వచ్చి తనే పలకరించుకుని తన స్థితిని తెలుపుతుంది.

"మాదీ ఒకప్పుడు కాస్త జరుగుబాటు గల కుటుంబమే. కానీ మా సీమలో వర్షాలు రాక, పంటలు పండక కుటుంబం క్రమంగా చితికిపోసాగింది." (పేజీ-51) అనీ, తనకు పెళ్ళి కూడా అయిందనీ, అక్కడ బతుకలేక సకుటుంబంగా కదిరి నుంచి వలస వచ్చేసినామని, ప్రస్తుతం ఏదో పని దొరికిందనీ, ఆ రోజు మంచి బట్ట కడితే మగాళ్ళు దృష్టి నాపైన ఎక్కడ పడుతుందోనని భయపడి వద్దన్నాననీ తన ఆత్మాభిమానాన్ని గురించి చెబుతుంది.

ఈ సంపుటంలో ఉద్యోగస్తులకు సంబంధించిన మూడు కథలున్నాయి. అవి శ్రమజీవన మాధురి, గులాబీ గోళ్ళు, వెలుగులోకి. శ్రమజీవన మాధురి కథలో ఒక ముస్లిం కుటుంబంలోని శ్రమసౌందర్యం గురించీ, డిగ్నిటీ ఆఫ్ లేబర్ గురించీ ప్రధానంగా చెప్పడంతో దాన్ని ముస్లిం జీవిత కథల్లో చేర్చడం జరిగింది. మిగిలిన రెండు కథల ఉద్యోగినుల సమస్యల గురించి చెప్పినవి.

ఎంత తెలివితేటలున్నా, ఎంత మంచిగా వున్నా మహిళా ఉద్యోగస్తులకు మగవాళ్ళతో బాధలు తప్పడంలేదు.

సుధ అందగత్తె. ఒక ఆఫీసులో అసిస్టెంటు. గతంలో ఇంకో ఊరిలో ఉద్యోగం చేసేటప్పుడు లంచగొండి, స్త్రీలోలుడు అయిన అక్కడి ఆఫీసరు ఫణీంద్రతో యాగలేక అతికష్టంమీద ట్రాన్స్‌ఫర్ చేయించుకుని ఈ ఆఫీసుకు వచ్చింది. ఇక్కడ ఏ సమస్యాలేదు. కానీ అదే ఫణీంద్ర కూడా అదే ఆఫీసుకు ట్రాన్స్‌ఫరై బాస్‌గా రావడం, అతను తిరిగి తనకు లొంగిపో అని వేధించడం, అందుకామె తిరస్కరించడంతో ఆమెపైన రిమార్క్స్ ఫైల్‌పెట్టి బాధిస్తుంటాడు. ఆ విషయం తన భర్తకు చెప్పగా, ఆ యిద్దరు ముట్టికి చేయంటనిరీతిలో ఒక కాంట్రాక్ట్ విషయంలో లంచం తీసుకుంటున్న అతన్ని ఎ.సి.బి.కి పట్టించేస్తారు.

ఈ కథలో లైంగిక వేధింపులకు గురయ్యే ఉద్యోగినులు క్రుంగిపోకూడదనీ, ధైర్యంచేసి ఎదుర్కోవాలనే సందేశం బలంగా చెప్పబడింది.

ఏదయినా ఒక సమస్య ఎదురైనప్పుడు స్త్రీ సంఘాలనీ, సమాచార రంగాలని ఆశ్రయించడం శాశ్వతపరిష్కారం కాదనీ, ధైర్యంగా ఎదిరించి నిలబడడమే ఏకైక మార్గమనీ చెప్పే కథ వెలుగులోకి.

ఒక ప్రైవేటు కాలేజీలో సూపరెంటెండెంట్‌గా పని చేస్తున్న రచయిత దగ్గరకు ఒక రోజు శకుంతల అనబడే మరో కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న ఆవిడ వచ్చి ఈ కళాశాలలో పనిచేస్తున్న జయంత్ అనే లెక్చరర్ నన్ను కొద్దిరోజుల క్రితమే పెండ్లి చేసుకున్నాడని చెబుతుంది. కానీ అతని సర్వీస్ రిజిస్టర్‌లో తల్లి, దండ్రి, చెల్లి ఫ్యామిలీమెంబర్స్‌గా ఎంట్రీ వుందిగానీ శకుంతల పేరు వుండదు. పైగా అతని అన్న, తల్లిదండ్రులు వచ్చి బెదిరిస్తున్నారని చెబుతుంది. అంతేగాక అతనికి రెండోపెళ్ళి చేయబోతున్నారని వాపోయి, తన పెండ్లినాటి ఫోటోలు చూపించి అతన్ని కలవాలని అంటుంది. కాని కొద్దిరోజుల క్రితమే అతను శెలవుపైన వెళ్ళిపోయాడని సూపరెంటెండెంట్ చెబుతాడు. ఆ మరునాడే టీవీల్లో, పత్రికల్లో జయంత్ చేసిన మోసం సంచనల వార్తగా మారుమ్రోగుతుంది.

మహిళాసంఘాలు ధర్నాలు చేస్తాయి. రెండు మూడు రోజుల్లో అన్నీ మళ్ళీ సద్దుమణిగిపోతాయి. చాలా రోజుల తర్వాత దయనీయంగా తనను కలవడానికి వచ్చిన శకుంతలకు సూపరెంటెండెంట్ టీవీలు, పత్రికలు, సంఘాలు చేసిన హంగామా అంతా తాత్కాలికమనీ, శాశ్వత పరిష్కారం కోసం, న్యాయం కోసం నీకు నీవే ధైర్యంగా న్యాయపోరాటం చేయమని చెబుతాడు.

భార్యభర్తల బంధం ఎంత బాగుంటే ఆ కుటుంబం అంత పటిష్టంగా వుంటుంది. ఈ భార్యభర్తలు అనుబంధం గురించి 'నీలిమబ్బులు' కథలో చిత్రించారు సికిందర్.

కుటుంబ వ్యవస్థ స్థిరంగా వుండడానికి కారణం ఆ కుటుంబంలోని భార్యభర్తల సఖ్యతే. భార్యభర్తల బంధం ఎంత బాగుంటే ఆ కుటుంబం అంత పటిష్టంగా వుంటుంది. ఈ భార్యభర్తలు అనుబంధం గురించి 'నీలిమబ్బులు' కథలో చిత్రించారు సికిందర్.

దంపతులకు ఒకరిమీద ఒకరికి ప్రేమ ఒకటే వుంటే సరిపోదు. ఒకరిపైన ఒకరికి నమ్మకం వుండాలి. అది లేనప్పుడు ఆ సంసారం సాఫీగా సాగదు. ఒకరిమీద ఒకరికి అనుమానాలు అస్సలు వుండకూడదు. ఒకవేళ వచ్చినా తిరిగి అవి దూదిపింజల్లా తేలిపోవాలి. నీలిమబ్బుల్లా కరిగిపోవాలి.

విజయ, రామారావులు భార్యభర్తలు. ఒకరోజు రాత్రి భర్తను కౌగిట్లో చేర్చుకున్న తరుణంలో అతను 'చాలు రమా. ఈ జన్మకు ఈ ఆనందం చాలు' అని పలవరిస్తాడు. దాంతో విజయ, రమ ఎవరని అనుమానం పెంచుకుని అప్పట్నుంచీ భర్తతో మాట్లాడదు. దగ్గరకీరాదు. ఐదారురోజులకు రామారావు సహోద్యోగి నిన్న మీ ఆవిడ ఉంగరాల జుట్టతనితో హోటల్లో మాట్లాడుకోవడం చూశానని చెబుతాడు. ఆ జుట్టుగాడు ఎవడన్న అనుమానం రామారావుది. దాంతో ఆ భార్యభర్తలు ఎడమొహం పెడమొహాల ఎక్కువైతాయి. కానీ ఆ రోజు బెడ్‌రూంలో కనిపించిన నవలను తిరగేస్తున్న విజయకు అందులోని హీరోయిన్ రమ అనీ, దాన్ని చదివి రామారావు 'రమ'ను పలవరించాడనుకుని కోపాన్ని, అనుమానాన్ని తగ్గించుకుంటుంది. ఆ మరునాడే ఇంటికొచ్చిన రింగుజుట్టు బావమరిది హోటల్లో మా అక్కతో కలిసి టీ తాగానని చెప్పగానే రామారావు అనుమానమూ తొలగిపోతుంది. ఆ దంపతులు తిరిగి ఒకటవుతారు. ప్రతి సంసారంలోను ఇలా అనుమానాలు పటాపంచలైతే ఎంత బాగుంటుందోననిపిస్తుంది కథ.

భార్యభర్తల గురించి 'నీలిమబ్బులు' కథలో చెప్పినట్లు గానే ప్రేయసీ ప్రేమికుల గురించి సికిందర్ ఋతుశోష, వ్యాలెంటీన్స్ కథల్లోను చిత్రించారు.

రైతు దంపతులయిన మంగమ్మ పుల్లయ్యలు ఎంత పేదరికంలో వున్నా తమ కూతురు హరితను పట్నంలో పై చదువులు చదివిస్తుంటారు. ఆమెను క్రిష్టఫర్ అనే యువకుడు ప్రేమిస్తున్నానని వెంటపడతాడు. నిజంగా నన్ను ప్రేమిస్తుంటే "పెళ్ళిచేసుకుందాం బాగా ఆలోచించు." (పే.109) అని అడుగుతుంది హరిత. అతను కోటీశ్వరుడయిన కాంట్రాక్టర్ రెవరెండు జార్జి కొడుకు. అందుకే అతను దానికి సమాధాన చెప్పలేదు. కానీ మరోరోజు వచ్చి తన తల్లిదండ్రులు తమ పెళ్ళికి వప్పుకున్నారంటాడు క్రిష్టఫర్ అది జరిగిన కొన్ని రోజులకు చరితతో అతని పెళ్ళి జరుగుతున్నట్లు పెళ్ళి కార్డు అందుకొని నిశ్చేష్టురాలైపోతుంది హరిత.

అనాది కాలం నుంచీ ఆర్థిక వ్యత్యాసాలతో ప్రేమలు ఫలించవని వస్తున్న భావనలో ఈనాటికీ ఏ మార్పులేదని చెప్పిన కథ ఇది.

వ్యాలెన్‌టీన్స్ డే అంటే ప్రేమికులరోజు గురించి రాసిన కథ ఇది. సీత, పరిమళ, భార్గవి స్నేహితురాండ్రు. కాలేజీ విద్యార్థినులు. పరిమళ, భార్గవిలు ఫాస్ట్ అమ్మాయిలు. సీత నిదానస్తురాలు. వారు ప్రేమ షికార్లు, ఎంజాయ్‌మెంట్ అంటూ తిరిగేవారు. సీతను బలవంతంగా తమ కాలేజీలో జరుగుతున్న 'వ్యాలెన్‌టైన్స్ డే' కి తీసుకుపోతారు. అక్కడ వారు బాయ్ ఫ్రెండ్స్‌తో కబుర్లు చెప్పుకుంటూ తుళ్ళింతల పడుతుంటే సీత, శాంతి ఒంటరిగా కనిపిస్తారు. అయితే పరిమళ, భార్గవీల బాయ్‌ఫ్రెండ్స్, శరత్, ప్రసాద్‌లు బాగా తాగేసి వాళ్ళను దూరంగా తీసుకెళ్ళి అత్యాచారం చేయబోయి పోలీసులు రావడంతో పారిపోతారు. ప్రేమికుల దినం పేరుతో ఉత్సవాలు జరుపుకునే ప్రాంతాలలో జరిగే నికృష్ట సంఘటనల్ని అతి సహజంగా ఈ కథలో చిత్రించడం జరిగింది.

విద్యాసంస్థల్లో చదువుకునే విద్యార్థి గురించీ, పనికిరాని చదువుల గురించి కూడా సికిందర్ కథలు రాశారు. పనికొచ్చే చదువు, అమ్మచీర కథలు ఆ కోవకు చెందినవే.

కార్పొరేట్ విద్యాసంస్థల్లో లక్షలు ఖర్చుపెట్టి పెద్దపెద్ద చదువులు చదివినా ఆ చదువుల వల్లా ఉపయోగం లేకుండా అయిపోతోంది. చదివిన వెంటనే బతుకు తెరువు కల్పించేదే కదా నిజమైన చదువు. ఈనాటి యువత ఆలోచింపదగిన కథ ఇది. ఏ చదువైనా భౌతికంగా, మానసికంగా, ఆర్థికంగా,

సామాజికంగా సమానంగా మనిషికి 'ఆల్‌రౌండ్ గ్రోత్' కలిగించేదే అసలు సిసలైన చదువు.

**తల్లిలా తమ్ముని వెతుక్కుంటూ అతని అక్క గుడిసెకు వస్తుంది. ఆత్మహత్య చేసుకోవాలనుకున్న రాములయ్యను అమ్మచీర అలా కాపాడుతుంది.**

రఘురాం కొడుకు వినయ్. రామారావు కొడుకు విజయ్ ఇద్దరూ మంచి ఇంటిలిజెంట్లే. రఘురాం, రామారావులు మంచి స్నేహితులు. రామారావు ఉద్యోగస్తుడు కావడం వల్ల ఆర్థికంగా బాగుంటాడు. రఘురాం ఆర్థికస్తోమత లేనివాడు. వినయ్, విజయ్‌లు ఇంటర్ ఫస్టుక్లాసులో పాసవుతారు. డబ్బులు బాగా వున్నోడు రామారావు కావడం వల్లా కొడుకుకు కోచింగ్ యిప్పించి ఇంజినీరింగ్‌లో చేర్పిస్తాడు. రఘురాంకు డబ్బుల్లేకపోవడంతో వినయ్‌ని చదువుమాన్పించి ఒక ఎలక్ట్రిక్ షాపులో చేర్పిస్తాడు. రామారావు బదిలీ అయ్యి వేరే ఊరికి వెళ్ళిపోతాడు. కొన్ని ఏండ్ల తర్వాత స్నేహితులిద్దరూ మళ్ళీ కలుసుకుంటారు. ఒకరి కబుర్లు ఒకరు చెప్పుకుంటారు. ఆ కబుర్లలో విజయ్‌కు లక్షలుపెట్టి బి.ఇ. చేయించి ఏండ్లు గడుస్తున్నా ఉద్యోగం రాలేదనీ, ఇంకా పెండ్లి కాలేదనీ, బేకారుగా తిరుగుతున్నాడని తెలుస్తుంది. వినయ్ ఎలక్ట్రిక్ షాప్ పెట్టాడని చెప్పి ఆ షాపుకు రామారావును తీసుకు వెళతాడు రఘురాం. అది చాలా పెద్దషాపు. లక్షల వ్యాపారం జరుగుతున్న ఖరీదయిన ఎలక్ట్రిక్ షాపు. రామారావు ఆశ్చర్యపోతాడు. వినయ్ ఇంటర్ అయిన తర్వాత ఆరునెలల ఎలక్ట్రిక్ వర్క్ నేర్చుకుని షాపుపెట్టి లక్షలు సంపాదించాడనీ, షాపుద్వారా డబ్బులు సంపాదించిన తర్వాత నైట్ కాలేజీలో చేరి ఎ.ఎం.ఐ.ఇ.ఎలక్ట్రికల్ ఇంజినీరింగు కూడా చేశాడని చెబుతాడు. రామారావ్ నీరసంగా తలవంచుకుంటాడు. "పిల్లలకు పెద్దలందివ్వాల్సింది డబ్బులు సంపాదించిపెట్టే చదువుకాదనీ, విజ్ఞానంతో బాటు కష్టపడి పనిచేసే తత్వాన్ని అలవాటు చేసే చదువులు కావాలనీ" అనుకుంటాడు.

'అమ్మచీర' కథలో రాజమ్మ సిద్ధయ్యలు రాయలసీమలోని ఒక పేదరైతు కుటుంబానికి చెందిన దంపతులు. వారికి ఒక కూతురు, ఒక కొడుకు. కరువుల వల్ల పంటలు పండలేదు. అందుకని డబ్బుల్లేక, భార్య వున్నా సంతానం కలగని కారణంగా రెండో వివాహానికి సిద్ధమైన ఒక వ్యక్తికిచ్చి సిద్ధయ్య కూతురికి పెళ్ళి చేశాడు. కానీ బతికేదే కష్టమైపోయిన దీనస్థితికి చేరుకుని ఒక చిల్లర దుకాణంలోను, టీకొట్టులోను చేసిన అప్పునుసైతం తీర్చలేక భిక్షాటనం చేసుకునే స్థాయికి దిగజారిపోతారు. సిద్ధయ్యకు తాగుడుతనం కూడా అలవాటైపోతుంది. సేద్యంకోసం చేసిన అప్పులు కూడా అలాగే వుండడంతో సహాయం కోసం, పనులకోసం కొడుకును తన కూతురుకు అప్పజెప్పి కేరళ వెళ్ళి తిరిగిరారు. నాయన చేసిన అప్పుకి టీ కొట్టులోను, కిరాణా షాపులోను వెట్టిచాకిరీ చేస్తూ బడికి పోతుంటాడు వారి కొడుకు రాములయ్య. ఇంట్లో వండుకోలేక ఆ వెట్టిచాకిరీ చేయలేక అక్కయింటికి వెళతాడు రాములయ్య. అక్క మంచిదే, కానీ అక్క సవతి, మొగుడు ఆమెను రాసి రంపాన పెడుతూ రాములయ్యను ఇంట్లోనుంచీ వెళ్ళిపోయేటట్టుగా చేస్తారు. రాములయ్యకు బాల్యంలో ఒంటరిగా, అందరూ వున్న అనాధలా బతుకుతున్న తన జీవితం పైన తనకి అసహనం కలిగి ఆత్మహత్య చేసుకుని చనిపోవాలనుకుంటాడు. మొదట రైలు కిందపడి చనిపోవాలనుకొని రైలుపట్టాల దగ్గరకెళతాడు. అక్కడున్న రైల్వే ఉద్యోగులు అతన్ని తరిమేస్తారు. ఆ తర్వాత వచ్చీపోయే బస్సులకింద పడి చావాలనుకున్నా కుదరదు. నిర్మాణంలో వున్న అపార్ట్‌మెంట్‌పైకెళ్ళి దూకి చావాలనుకున్నా అక్కడ కూలీలు చావనీయరు. ఇక చివరికి తను వుంటున్న గుడిసెలోనే జాజిపెట్టెను ఎక్కి, పైనున్న దూలానికి అమ్మకట్టుకునే పాతచీరను బిగించి ఉరిపోసుకోవాలనుకుని ఒక కొసను దూలానికి వ్రేలాడదీసి, మరోకొసను గొంతుకు బిగించి జాజిపెట్టెను కాళ్ళతో పక్కకి తోసేస్తాడు. కానీ అమ్మచీర సగంలో పుట్టుక్కున తెగిపోయి రాములయ్య కిందపడతాడు. అప్పుడే శాడిస్టులైన సవతిని, మొగుడును వదిలేసి తల్లిలా తమ్ముని వెతుక్కుంటూ అతని అక్క గుడిసెకు వస్తుంది. ఆత్మహత్య చేసుకోవాలనుకున్న రాములయ్యను అమ్మచీర అలా కాపాడుతుంది.

ఇవీ 'అమ్మచీర' కథల సంపుటిలో వున్న కథల విశేషాలు. ఈ విశేషాలన్నీ మధ్య తరగతి మనుషుల బాధలకు సంబంధించినవేనని వేరుగా చెప్పాల్సిన అవసరం లేదు.

# హైకూలు

- బి. గోవర్ధనరావు
9441968930



వాడ బ్రతుకు
అంతరాలు ఎందుకు?
కలిసే వుందాం!

కాలచక్రంతో
దినమణి పరుగు
పదముందుకు!

కంటి పాపలు
చూపుల పొదరిల్లు
నేటి ఆశలు

వాన వచ్చింది
నేలమ్మ మురిసింది
పచ్చని కల

నూతనత్వమే
నేలమ్మ మురిసింది
పచ్చని కల

నూతనత్వమే
నిలిచి గెలిచింది
అరుణోదయం!

ప్రతీ నిమిషం
పరీక్షా సమయమే!
జీవనపోరాటం!

కోయిలపాట
మదిలో ఆడే ఆట
శ్రవణానందం!

రోజుకో ఊరు
వలస బ్రతుకులు
తీరం చేరవు!

రంప పితూరి
వీర విప్లవ భేరి
స్వేచ్ఛా నినాదం!

శ్రీశ్రీ కవిత్వం
కష్టజీవుల గళం
ప్రజల పక్షం!

ఇటుక బట్టీ
ఇంటిని అల్లిన మట్టి
నివాస యోగం!

నిన్నటి స్నేహం
కొత్త కలనిచ్చింది
రేపటి గమ్యం!

బిగ్ బజార్
రేట్లు చూస్తే బేజార్
తిండి తగ్గింది!

బ్రతుకు కోసం
నిరంతర పయనం
అలల కల!

చలి సంగీతం
మంచుగారి స్వాగతం
దుప్పటి గూడు!

ఏడు పాయల్లో
రాజమహేంద్రవరం
గోదారి దీపం!

గుండె చప్పుడు
గొంతు పాటెత్తుకుంది
శ్రమ జీవనం!

చెట్టంత నీడ
నేలచెంత చేరింది
సేద తీర్చింది!

నల్లమబ్బులు
నింగిని అల్లుకున్న
వాన పాటలు!

అగ్ని రుతువు
వేసవి రగిలింది
దాగని దాహం!

రోజుకో ఊరు
వలస బ్రతుకులు
తీరం చేరవు! ◆

---

# 'శోక' లవ్యుడు

- జి.వి. రమణ
9848602967



అరచేతిలో అద్భుతంపై
నీ చూపుడు వేలు
వడ్రంగి పిట్టవుతుంది.
పోటుపోటుకూ
మత్తు తలకెక్కుతుంది

చైనా వస్తువులపై
నగర కోర్టుల నిషేధాలేమిటో?
గోవధ వ్యథలలో నిజానిజాలేమిటో?
వస్తుసేవల పన్ను
పెట్రోను తాకని వైనమేమిటో?
జల్లెడపట్టే జవసత్వాలు
నీలోనుండి ఎగిరిపోతాయి.

ఇంతలో గమ్మత్తుగా
దేశపు ఒక శాతం
శతకోటేశ్వరుల చేతిలో
సేవారంగాలు బంధీలవుతాయి.
'సెజ్'లన్నీ భూబకాసురుల
జఠరాగ్నిలో కరిగిపోతాయి.

వారి వారి దక్షిణ హస్తాల చెంతకు
సున్నాలు చేరువవుతాయి.

నీవేమో...
చూపుడు వేలు కోల్పోయిన
'శోక' లవ్యుడవుతావు. ◆

నెల్లూరు జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో

# జాషువా సాహిత్యంపై సదస్సు



నెల్లూరు జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అక్టోబర్ 22న జరిగిన జాషువ సాహిత్య సభలో ప్రసంగిస్తున్న డా॥ కోయి కోటేశ్వరరావు. చిత్రంలో వి. బాలసుబ్రహ్మణ్యం. ఆచార్య వి. వీరయ్య, డా॥ ఈదూరు సుధాకర్, జంధ్యాల రఘుబాబు, పి. గోపనాథ్

సాహితీస్రవంతి శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో అక్టోబర్ 22న 'జాషువ కవిత్వం – వర్తమానం' అంశంపై నెల్లూరులోని జెట్టి శేషారెడ్డి విజ్ఞానకేంద్రంలో సదస్సు జరిగింది. తెలంగాణ రాష్ట్రం కోదాడలోని కె.ఆర్.ఆర్. ప్రభుత్వ డిగ్రీ మరియు పి.జి. కళాశాలలో సహాయ ఆచార్యులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహిత్యవేత్త డా॥ కోయి కోటేశ్వరరావు ప్రధాన వక్తగా ఈ సదస్సుకు హాజరయ్యారు. వీరితోబాటు శాసనమండలి సభ్యులు వితపు బాలసుబ్రహ్మణ్యం, విక్రమ సింహపురి విశ్వవిద్యాలయ ఉపకులపతి ఆచార్య వి. వీరయ్య, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు ప్రత్యేక అతిథులుగా ఈ సభలో పాల్గొన్నారు. డా॥ కోయి కోటేశ్వరరావు ప్రసంగిస్తూ గుర్రం జాషువను కేవలం ఒక కులానికో, ఒక ప్రాంతానికో పరిమితమైన కవిగా చూడతగదనీ, రవీంద్రనాథ్ టాగూర్, ప్రేమ్‌చంద్‌లా ఆయన జాతీయ కవి అనీ, రెండవందల యాభైకి పైగా వస్తు వైవిధ్యం గల అంశాలపై కవిత్వం అల్లి మానవత్వానికి తన సాహిత్యంలో పెద్దపీట వేసిన విశ్వనరుడని పేర్కొన్నారు. జాషువ రాతల్లోకి తొంగిచూస్తే కన్నీటి గాథలెన్నో గోచరిస్తాయన్నారు. ఆయన ఎంపిక చేసుకున్న అనేకానేక వస్తువుల్లో దళిత వేదన కూడా ఒకటనీ, ఈ దేశంలో కుల మత అంతరాలు కొనసాగినంత కాలం జాషువ రచనలకు ప్రాసంగికత ఉంటుందని తెలిపారు. ఆయన రచించిన గబ్బిలం కావ్యం ఈ సహస్రాబ్ది గొప్ప పుస్తకాల జాబితాలో స్థానం సంపాదించుకున్నదని అన్నారు. అధ్యాత్మిక తీవ్రవాదాన్ని నిర్ద్వందంగా ఖండించడం, కష్టజీవి పక్షం వహించడం, స్త్రీ విముక్తిని ప్రస్తావించడం ఆయన రచనల్లో ప్రధానంగా కనిపిస్తుందని తెలిపారు. వర్తమాన సమాజంలో కులం పేరుతో ఇంకా కొనసాగుతూనే ఉన్న పీడన నుండి విముక్తి పొందడానికి అవసరమైన తాత్విక పునాదులు జాషువ సాహిత్యంలో ఉన్నాయని చెప్పారు.

విక్రమ సింహపురి విశ్వవిద్యాలయ ఉపకులపతి ఆచార్య వి. వీరయ్య మాట్లాడుతూ దేశంలో ప్రతి వ్యక్తి కులం పేరుతోనో, మతం పేరుతోనో మనుగడ సాగిస్తూ ఉంటే... కులమతాలు గీచిన గీతలకు చిక్కి పంజరంలో కట్టుబడని విశ్వనరుడు తానని ఆత్మవిశ్వాసంతో ప్రకటించుకున్న గుర్రం జాషువ గొప్ప మానవతావాది అని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు ప్రసంగిస్తూ రెండు గ్లాసుల పద్ధతి ద్వారా అనాగరిక అస్పృశ్యత భావన నేటికీ మన సమాజంలో కొనసాగుతూనే ఉన్నదనీ, కులం పేరుతో దళితులపై దాడులు, మతం పేరుతో మారణహోమం జరుగుతూనే ఉన్నాయనీ అన్నారు. ఈ పరిస్థితులలో జాషువ సాహిత్యాన్ని ప్రజలకు చేరువ చేయవలసిన అవసరం ఎంతగానో ఉందని అన్నారు.

సాహితీస్రవంతి నెల్లూరు జిల్లా కమిటీ అధ్యక్షులు డా॥ ఈదూరు సుధాకర్ అధ్యక్షత వహించిన ఈ సదస్సులో వివిధ రంగాలకు చెందిన ప్రముఖులతో బాటు పలువురు కవులు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు. దేశభక్తి గీతాలాపనతో ప్రారంభమైన సభలో పదిహేను మంది కవులు తమ కవితలను గానం చేశారు. డా॥ ఈదూరు సుధాకర్ సంపాదకత్వంలో 'సాహితీస్రవంతి' నెల్లూరు జిల్లా కమిటీ ప్రచురించిన 'నేటి కలాలు – రేపటి గళాలు' అభ్యుదయ సాహిత్య మాసపత్రిక తొలి సంచికను ఆచార్య వి. వీరయ్య ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి జిల్లా కమిటీ ప్రధాన కార్యదర్శి పి. గోపినాథ్, ఉపాధ్యక్షులు చెలంచర్ల భాస్కర్ రెడ్డి, కార్యదర్శులు ఈతకోట సుబ్బారావు, యస్. చెంగయ్య, సభ్యులు యం. వి. చలపతి, జి. వేణుగోపాలరావు, బద్దెపూడి శీనయ్య పాల్గొన్నారు.



'నేటి కలాలు – రేపటి గళాలు' అభ్యుదయ సాహిత్య మాసపత్రిక తొలి సంచికను ఆవిష్కరిస్తున్న దృశ్యం.

**- పి. గోపినాథ్**

# అంతిమ గమ్యం

- ఉషా రాణి
9492879210



అనంత విశ్వం లో విహంగంలా ఎగిరి
ప్రపంచాన్ని చుట్టిరావాలనుకున్నాను
కానీ ఈ నల్లబల్ల ఎదురుగా బంధీనయ్యాను
ఆల్ప్స్ పర్వతాలు అధిరోహించి
హిమ గిరుల అంచులు తాకి
కాంచన్ జంగా మకుటంపై
త్రివర్ణ పతాకం పాతి రావాలనుకున్నాను
కానీ ఈ మూసిన తలుపులు నా కాళ్ళకు సంకెళ్లు వేస్తున్నాయి.
టాగోర్‌లా కవిత్వం వ్రాసి
పికాసోలా బొమ్మలద్ది
ఖజురహో అందాలను అమరావతికి తేవాలనుకున్నాను
కానీ ఈ డస్టర్ మోతలకు చెవులు చిల్లులు పడుతున్నాయి
నల్లబల్లపై అంకెలు
తెల్లకాగితంపై అంకెలు
అంకెలు అంకెలు నా చుట్టూ అంకెలే
సిరా చుక్క అంతిమ గమ్యం అంకెలేనా ?
ఈ అంకెలలో ఈదితేనే ఐదంకెల బతుకంటుంది అమ్మ
ఐదంకెల బతుకే ఎందుకు ?
అమ్మంటే నాకిష్టం
కానీ అమ్మకి ఈ బందిఖానా అంటే ఎందుకిష్టమో !!
నేను మోయలేని నా బరువైన స్కూల్ బాగ్ మోసిన అమ్మ !
పిడుగు పాటుకి నే ఉలిక్కి పడితే
భయం లేదని నన్ను హత్తుకున్న అమ్మ !
ఆకలి అనకుండానే నా ఆకలి తీర్చిన అమ్మ !
అమ్మ ఆశలు నా చెవులలో హోరుపెడుతున్నాయి
నన్ను లాలించి బుజ్జగించి నడిపించే అమ్మ నాదే,
కానీ కాదు.
తారల హారాల తీరాలలో నా మౌత్ హార్మోన్లలో
పాటలు వినిపించాలని
నేనేరి కూర్చిన పారిజాతం పూల సువాసనలతో
అమ్మను ముంచెత్తాలని
సముద్ర కెరటాల నురుగులలో
అమ్మతో పడవ ప్రయాణం చేయాలనీ
నా ఆశలు, నా ఆశలు అమ్మవి కావు
ఆమె ఆశలు నావి కావు
ఆమె స్వప్నించమని చెప్పే బతుకు నాది కాదు
సజీవంగా ఉండి నిర్జీవంగా పడుతున్న
అడుగులు ఆగితేనేం?
కలం చేజారితేనేం ? ◆

# నా దారిలో నేను

- నూనెల శ్రీనివాసరావు
9492970231

నాకు తెలీదనుకుంటాను
మంచి చెడ్డల లోకంలో
మంచెందుకు తెలిపోతుందో
చెడెందుకు పాతుకుపోతుందో!
నిజమే మరి
చావు పుట్టుకల మధ్య
నేనెప్పుడూ జీవితాన్ని
తూకం వేసుకుంటుంటాను
నన్ను నేను
సమాజమనే అద్దంలో
చూసే మురిసిపోవాలనుకుంటాను
నా పచ్చదనం కోసం
పరితపిస్తూనే
నా చుట్టూ వసంతానికి
పాదులేస్తుంటాను



అందుకేనేమో
నన్నెరిగిన వాళ్ళు
నా వెనుక జాలితో
పెదవి విరుస్తున్న చప్పుడు
నా చెవిలో పడుతూనే వుంటుంది
ఐనా ఏం చేస్తాం!
ఆశయాల చుట్టూ
అల్లుకున్న నేను
అన్యదా తిరగలేను
ఎన్నటికీ చెదరలేను
నా చుట్టూ అలుముకుంటున్న
గాడాంధకారాన్ని
పటాపంచలు చేసే
నిప్పురవ్వనై
మండుతూనే వుంటాను
రోజూ దోసిళ్ళతో
అక్షరాల విత్తులు నాటి
సరికొత్త లోకాన్ని
కలలు కంటూనే వుంటాను! ◆

## రచనలకు ఆహ్వానం

సామాజిక తత్వవేత్త బి.ఎస్. రాములు 50 ఏళ్ళ 'సాహిత్య స్వర్ణోత్సవ సంవత్సరం' (1967-2017) సందర్భంగా "ప్రపంచ తెలుగు మహా సభల"ను పురస్కరించుకొని, తెలంగాణ జీవితం, సంస్కృతి, భాష, సామాజిక పరిణామాలను చిత్రించే ఉత్తమ కథ, ఉత్తమ నవల, ఉత్తమ దీర్ఘ కావ్యం, ఉత్తమ వ్యాసం పోటీకి రచనలను ఆహ్వానిస్తున్నట్లు ఒక ప్రకటనలో తెలిపారు. ఉత్తమ కథకు రూ. 10,116 /- నగదు బహుమతి. ఐదు కథలకు రూ. 2,116/-ప్రోత్సాహక బహుమతులు. పుస్తకం సైజులో పేజీకి ఇరవై-ముప్పయి లైన్లతో, ఎనిమిది పేజీలకు తగ్గకుండా, పన్నెండు పేజీల వరకు ఉండవచ్చు. ఉత్తమ నవలకు రూ. 25,000 /- నగదు బహుమతి. ఐదు నవలలకు రూ. 5,116/- ప్రోత్సాహక బహుమతులు. పుస్తకం సైజులో, స్వాతి, చతుర, ఆంధ్రభూమి మాస పత్రికలలో ప్రచురించే నవల సైజు మించకూడదు. ఉత్తమ దీర్ఘ కవిత-దీర్ఘ కావ్యంకు రూ. 11,116/- నగదు బహుమతి. ఐదు దీర్ఘ కవిత, దీర్ఘ కావ్యంలకు రూ. 2,116/-ప్రోత్సాహక బహుమతులు. పుస్తకం సైజులో, పేజీకి ఇరవై ఎనిమిది - ముప్పయి లైన్లతో నలబై నుండి ఎనబై పేజీల వరకు ఉండవచ్చు. దీర్ఘ కవితలుగా వచన కవిత, పాట, పద్యం ప్రక్రియలలో పంపవచ్చు. తెలంగాణ ఉద్యమం గురించి చిత్రించిన, కనీసం స్పర్శించిన కథలు, నవలల గురించి వివరించే, సమీక్షించే 'ఉత్తమ వ్యాసానికి రూ. 5,116/- లు ఐదు ప్రోత్సాహక బహుమతులు రూ. 1,516/-లు. తెలంగాణ పాట కవులు, గాయకులు, తెలంగాణ ధూం ధాం, తెలంగాణ ఉద్యమంలో 1995-2014 మధ్య నిర్వహించిన పాత్ర, ప్రాధాన్యత గురించి వివరించే, సమీక్షించే ఉత్తమ వ్యాసానికి రూ. 5,116/- లు ఐదు ప్రోత్సాహక బహుమతులు రూ. 1,516/- వ్యాసాలు 10-12 పేజీలకు తక్కువ కాకుండా ఉండాలి. రాష్ట్రంలోని 45 మందికి పైగా సుప్రసిద్ధ కవులు, రచయితలు, సాహితీవేత్తలు ఆయా ప్రక్రియలలో న్యాయనిర్ణేతలు. తెలంగాణ సాహిత్య ప్రక్రియలను సుసంపన్నం చేయడమే ఈ పోటీలక్ష్యం. **చివరి తేది: 1 డిసెంబర్, 2017. రచనలు పంపవలసిన చిరునామా: సిహెచ్.వి. ప్రభాకర్‌రావు, కార్యదర్శి, విశాలసాహిత్య అకాడమి, 303 ఎటర్నల్ కృష్ణ, రోడ్ నెం. 4, హరిపురి కాలనీ, కొత్తపేట, హైదరాబాద్- 500 035,**

**ఫోన్: 9391533339, 8331966987.**

**ఇమెయిల్: chvprabhakarrao@gmail.com, bsramulu@gmail.com** ◆

## కథా, కవితా సంపుటాలకు ఆహ్వానం

గుంటూరు జిల్లా రచయితల సంఘం ప్రతీ సంవత్సరం జనవరి 1 నుండి డిశంబరు 31వ తేదీలోపు ప్రచురించబడిన స్వీయ కవిత, కథా సంపుటాలను గత ఆరు సంవత్సరాలుగా పోటీకి ఆహ్వానించి, 'కథ, కవితా పురస్కారాల'ను అందిస్తున్నట్లు సంస్థ అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య, ఎస్.ఎం. సుభాని ఒక ప్రకటనలో తెలిపారు. ఈసారి 2016 సంవత్సరం జనవరి 1 నుండి డిశంబరు 31వ తేదీలోపు ప్రచురించబడిన కథ, కవితా సంకలనాలను ఈ పోటీకి పంపించవలసిందిగా కోరారు. పురస్కార గ్రహీతలకు రూ.5000ల నగదు అందజేయబడుతుందని తెలిపారు. 2017 నవంబర్ 15వ తేదీలోపు తమ రచనలను 3 ప్రతులను 'బొమ్ము ఉమామహేశ్వర రెడ్డి, ఫ్లాట్ నెం. 501, సాయి బృందావనం అపార్ట్‌మెంట్, 4/1, శ్యామలానగర్, గుంటూరు - 522 006 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ◆

## జనరంజక కవి ప్రతిభా పురస్కారాలు

రావి రంగారావు సాహిత్య పీఠం ఆధ్వర్యంలో గత మూడు సంవత్సరాలుగా జనరంజక కవి ప్రతిభా పురస్కారాలు అందిస్తున్నట్లు సంస్థ కన్వీనర్ నర్రా ప్రభావతి ఒక ప్రకటనలో తెలిపారు. 'రావి రంగారావు సాహిత్య పీఠం 2017' పురస్కారం కోసం కవిత్వ సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. స్పష్టంగా, సూటిగా సమాజ కేంద్రంగా భావయుక్తంగా ఉండే జనరంజక కవిత్వ గ్రంథాలు ఒక్క ప్రతి పంపవలసిందిగా కోరారు. ఎంపికైన కవితా సంపుటి కవికి రూ.2000ల నగదు, జ్ఞాపికతో గుంటూరు, బృందావన్ గార్డెన్స్, శ్రీవేంకటేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణంలోని అన్నమయ్య కళావేదికపై 2018 ఫిబ్రవరిలో జరిగే సభలో అందజేయనున్నట్లు తెలిపారు. 2013 సంవత్సరం నుండి 2017 వరకు ప్రచురించబడిన పద్య, గేయ, వచన కవిత్వ సంపుటాలను డిసెంబర్ 31లోపుగా 'నర్రా ప్రభావతి, కన్వీనర్, రావి రంగారావు సాహిత్య పీఠం, 101, అన్నపూర్ణ నగర్, 5వ లైను తూర్పు, గోరంట్ల, గుంటూరు - 522 034 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 924758185 ద్వారా సంప్రదించవచ్చును. ◆

## సరికొత్తగా సాహిత్య ప్రస్థానం

సాహిత్య ప్రస్థానం 15వ వార్షికోత్సవ సందర్భంగా సరికొత్త శీర్షికలతో మరింత ఆకర్షణీయంగా, ఆలోచనలు పెంచేవిధంగా సాహిత్య ప్రస్థానాన్ని వెలువరించబోతున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం.

* 2018 జనవరి నెల సంచిక నుండి మార్పులతో కూడిన సాహిత్య ప్రస్థానం సంచిక వెలువడుతుంది.
* మంచి రచనలకు, కొత్త ఆలోచనలు రేకెత్తించే సృజనకు ఎప్పటిలాగే సాహిత్య ప్రస్థానం వేదికగా ఉంటుంది.
* సాహిత్య ప్రస్థానం పత్రిక ధర కూడా ఆర్థిక పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని పెంచక తప్పట్లేదు. 15 ఏళ్లుగా ఒకే విధంగా రు.10గా వున్న పత్రిక ధరను 2018 జనవరి నుంచి రు.20 కి పెంచడం జరుగుతుంది.
* సాహిత్య ప్రస్థానం పేజీలు 64కు పెంచి, ఆ పేజీలను మరింత విశ్లేషణ కోసమే గాక మూడు మాసాల కొక ప్రత్యేక అధ్యయనం కోసం వినియోగించడం జరుగుతుంది..
* చందాదారుల చందాలను కూడా పెరిగిన ధరకు అనుగుణంగా సర్దుబాటు చేయటం జరుగుతుంది.
* చందాదారులు ఈ మార్పులను గమనించి సహృదయంతో ఎప్పటిలాగానే ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం.
* పత్రికలో మార్పులు, చేర్పులకు సంబంధించి పాఠకుల నుండి సూచనలు కోరుతున్నాం.

- ఎడిటర్

సాహితీస్రవంతి ఆధ్వర్యంలో

## చదువులా చావులా' జనకవనం



సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అక్టోబర్ 25న విజయవాడ, ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జరిగిన 'చదువులా ? చావులా?' జనకవనంలో ప్రసంగిస్తున్న డా॥ పి. విజయకుమార్. చిత్రంలో గంగాధర్ వీర్ల, డా॥ రావెళ్ళ శ్రీనివాసరావు, మందరపు హైమవతి.

సాహితీస్రవంతి ఆధ్వర్యంలో విజయవాడలోని ఎం.బి. విజ్ఞానకేంద్రంలో అక్టోబర్ 25న విద్యార్థుల బలవన్మారణాలకు వ్యతిరేకంగా 'చదువులా? చావులా?' అంశంపై జనకవనం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ వైద్యులు డా. పి. విజయకుమార్ మాట్లాడుతూ పెట్టుబడిదారీ సమాజం విద్యను వ్యాపారమయం చేయడం ఈ సమస్యకు మూలకారణమన్నారు. ఈ విధానాలను వ్యతిరేకించే వారంతా ఒక్క గొంతై పోరాడితేనే ఇటువంటి దుర్ఘటనలను ఆపగలమని అన్నారు. కార్పొరేట్ విద్యకు వ్యతిరేకంగా ఉద్యమించాల్సిన అవసరాన్ని ప్రజలందరూ తెలుసుకోవాలని కోరారు. 2012లో వెలువడిన ఒక నివేదికలో 15-29 సంవత్సరాల వయస్సులో ఆత్మహత్యలు చేసుకునే వారి సంఖ్యలో భారతదేశం ప్రపంచంలోనే ప్రథమ స్థానంలో ఉందని అన్నారు. లక్ష రూపాయల కన్నా తక్కువ వార్షికాదాయం ఉన్నవారే ఎక్కువగా ఆత్మహత్యలు చేసుకుంటున్నట్లు నివేదికలు చెప్తున్నాయని, దీన్నిబట్టి పేదలు, మధ్యతరగతి వారే ఈ దుర్ఘటనల వల్ల బలవుతున్నారని అన్నారు. మరో అతిథి ప్రముఖ కవయిత్రి మందరపు హైమవతి మాట్లాడుతూ ఒత్తిడి చదువులను నివారించడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలని కోరారు. పిల్లలపై మోయలేని సిలబస్‌లను రుద్దడం వల్లనే ఇటువంటి సంఘటలను జరుగుతున్నాయని అన్నారు. నేటి విద్యావిధానాన్ని ప్రక్షాళన చేయాల్సిన అవసరం ఉందని అన్నారు. పాఠశాలల్లో పిల్లలు ఎదుర్కొంటున్న సమస్యలను, అనుభవాలను వివరించారు. అనంతరం చిత్రకారుడు, కవి, రచయిత గంగాధర్ వీర్ల ఆధ్వర్యంలో జనకవనం జరిగింది. ఈ జనకవనంలో 30 మంది కవులు, కవయిత్రులు పాల్గొన్నారు. విద్యార్థుల సమస్యలపై ఎన్నో ప్రశ్నలను సంధిస్తూ సాగిన జనకవనం అందర్నీ ఆలోచింపజేసింది. ఇటీవలే ఇంజనీరింగ్ పూర్తిచేసిన అశోక్ అనే విద్యార్థి తన అనుభవాలను వివరించి, జనకవనం ప్రేరణతో తను రాసిన కవితను చదివి సభికులను ఆకట్టుకున్నారు. ◆

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,




# వైజాగ్ ఫెస్ట్ 2017- కథ, కవితల పోటీ

వైజాగ్ ఫెస్ట్ 2017 డిసెంబర్ 1 నుండి 10 వరకు జరుగుతుంది. ఈ ఉత్సవాల్లో ప్రముఖ ప్రచురణ సంస్థలతో పాటు 200ల పైన బుక్ స్టాల్స్‌తో 10 రోజుల పాటు పుస్తక ప్రదర్శన ఉంటుంది. ఆ సందర్భంగా ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించేందుకై కథలు, కవితల పోటీ నిర్వహించాలని ఆహ్వానసంఘం నిర్ణయించింది. ప్రజా శ్రేయస్సు సామాజిక చైతన్యం కోరే రెండు తెలుగు రాష్ట్రాల రచయితలు కవులూ ఈ పోటీలలో పాల్గొని ఉత్తేజకరమైన రచనలు పంపి ఈ ప్రయత్నం జయప్రదం చేయాలని కోరుతున్నాము. నేటి సామాజిక సవాళ్లకు తగిన స్థాయిలో మంచి రచనలను ఆహ్వానిస్తున్నాం. ఈ ప్రయత్నాన్ని ఫలప్రదం చేసి, చిరస్మరణీయ రచనలు అందించవలసిందిగా రచయితలను కోరుతున్నాం. కథల విభాగంలో మొదటి బహుమతి రూ. 8,000/-లు, రెండవ బహుమతి రూ. 5,000/-లు, మూడవ బహుమతి రూ. 3,000/-లు, కవితల విభాగంలో మొదటి బహుమతి రూ. 5,000/-లు, రెండవ బహుమతి రూ. 3,000/-లు, మూడవ బహుమతి రూ. 2,000/-లు.

## ఉత్తరాంధ్ర జిల్లాల కాలేజీ విద్యార్థినీ విద్యార్థులకు కథ, కవితల పోటీ

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలో ఇంటర్, డిగ్రీ, పాలిటెక్నిక్, ఇంజనీరింగ్, మెడిసన్ చదువుతున్న విద్యార్థినీ విద్యార్థులకు వేరుగా కథ, కవితల పోటీ ఉంటుంది. వారు 'తమ కళాశాల విద్యార్థి' అని నిర్ధారిస్తూ కళాశాల యాజమాన్యం ధృవపత్రం తప్పని సరిగా జతచేయాలి. ఆయా కాలేజీ యాజమాన్యాలు ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి సహకరించవలసిందిగా ఆహ్వానసంఘం కోరుతున్నది. కథల విభాగంలో మొదటి బహుమతి రూ. 5,000/-లు, రెండవ బహుమతి రూ. 3,000/-లు, మూడవ బహుమతి రూ. 2,000/-లు, కవితల విభాగంలో మొదటి బహుమతి రూ. 3,000/-లు, రెండవ బహుమతి రూ. 2,000/-లు, మూడవ బహుమతి రూ. 1,000/-లు.

### నియమ నిబంధనలు:

1. కథ ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 8 పేజీలు, డి.టి.పి. 15 సైజు ఫాంట్‌లో ఎ4 సైజులో 5 పేజీలకు మించకూడదు.
2. డి.టి.పి.చేసిన వాటిని పిడిఎఫ్, ఓపెన్ ఫైల్ రెండూ పంపించాలి.
3. మరీ సుదీర్ఘ కవితలు పంపవద్దు. ఒక కవి ఒక కవిత మాత్రమే పంపించాలి.
4. ఇటీవలి ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో ప్రజల జీవితాలలో వస్తున్న మార్పులకు సంబంధించిన అంశాల్ని ఇతివృత్తంగా స్వీకరించవచ్చు. ఇతివృత్తంతో పాటు రచనా శిల్పానికి ప్రాధాన్యత ఉంటుంది.
5. అచ్చయినవి, అనుకరణలు, అనువాదాలు పోటీకి అనర్హం. ఆ మేరకు హామీపత్రం రాయాలి.
6. గ్రామీణ జీవితం, మహిళలు, అణగారిన తరగతుల గురించి సజీవ చిత్రణలకు స్వాగతం. సామాజిక సమస్యలు, సమకాలీన సమస్యలను కూడా ఇతివ ృత్తాలుగా తీసుకోవచ్చు.
7. రచనలపై రచయిత, రచయిత్రులు తమ పేర్లు రాయకూడదు. హామీ పత్రంలో మాత్రమే పేరు, చిరునామా, ఫోన్ నెంబరు, ఇమెయిల్ వివరాలు రాయాలి.
8. ఫలితాలకు సంబంధించి న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.
9. పోటీకి అందిన కథలు, కవితలలో గెలుపొందిన వాటితో పాటు, సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన వాటితో కథ, కవితా సంకలనాలను ప్రచురించడం జరుగుతుంది.
10. కవరుపై కథ, కవితల పోటీకి అని రాసి రచనలను ఈ దిగువ చిరునామాకు పంపించాలి. చీకటి దివాకర్, ఇంటినెం. 1-17/1, ప్లాట్ నెం. 84, ఆదిత్యానగర్, కంటోన్మెంట్, విజయనగరం-535 003. ఈమెయిల్ cheekatid9@gmail.com ద్వారా కూడా పంపించవచ్చు. రచనలు చేరవలసిన చివరి తేది : 10 నవంబర్ - 2017.

విశాఖపట్నంలో 2017 డిసెంబరు 1 నుండి 10 వరకు జరిగే వైజాగ్ ఫెస్ట్ ప్రాంగణంలో బహుమతులు అందజేయడం జరుగుతుంది. వివరాలకు 94411 76882, 98487 10507, 87904 08525 నెంబర్ల ద్వారా సంప్రదించగలరు.



- చీకటి దివాకర్

కన్వీనర్, గురజాడ సాహిత్యవేదిక, ఆహ్వాన సంఘం వైజాగ్ ఫెస్ట్ - 2017

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 02.11.2017 ▪ Date of Publication: 27.10.2017

PRSVMO2A186

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు

## వేమన సాహిత్యంపై 14 ప్రామాణిక గ్రంథాలు













































ప్రస్థానం
పాఠకులకు
ప్రత్యేక
తగ్గింపు

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ 27-1-64, కారల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ. ఫోన్: 0866-2577533

If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A186 |
| పుస్తకం పేరు | (యేసునామం) |
| తారీఖు | 21/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Kaveri |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |